Regd. No.
H. NL. 88
సంపుటి: 56
సంచిక: 23

# జమీన్ రైతు

స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు
సంపాదకుడు : నెల్లూరు శ్రీరామమూర్తి

7-6-85
శుక్రవారం
12 పేజీలు
75 పైసలు.

# చంద్రబాబు, కాకుంటే చౌదరి?

**మా హైదరాబాదు విలేఖరి**

రెండోసారి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసిన తర్వాత సుమారు మూడు నెలల నుంచి తరమూండే తెలుగుదేశం పార్టీలో ముసలం పుట్టింది. పార్టీ అధ్యక్షుడుగా, ముఖ్యమంత్రిగా రామారావు తీసుకొంటున్న చర్యలకారణంగా పార్టీలో అసంతృప్తి కుతకుతలాడిపోతున్నది. పి. ఉపేంద్రను పార్టీ ప్రధాన కార్యదర్శి పదవినుంచి తప్పించడంతో దీనికి మరింత ఆజ్యంపోసినట్లయింది. తెలుగుదేశంను గద్దె దించడానికి ఇప్పటికే ప్రయత్నాలు ప్రారంభించిన ఈనాడు పత్రిక రామోజీరావు, ఉపేంద్ర ఉద్వాసనతో అగ్గిమీద గుగ్గిలంలాగా మండిపడుతున్నాడని అంటున్నారు.

పదవులు పోగొట్టుకున్న మాజీ మంత్రులతో సహా కొందరు అసమ్మతివాదులు కొంతకాలంగా సమావేశాలు నిర్వహిస్తూ తమ కార్యక్రమాలను నడుపుతున్నప్పటికి ఇటీవల కాలంలో వారి కార్యకలాపాల జోరు మరింత హెచ్చింది. పార్టీ అధ్యక్షుడికి సర్వాధికారాలను ధారాదత్తంచేస్తూ నిబంధనావళి మార్చడం ఉపేంద్రను తప్పించి పార్టీ బాధ్యతలను పరోక్షంగా చిన్నల్లుడు చంద్రబాబునాయుడుకు శ్రీ రామారావు అప్పగించడం వంటి చర్యలు అసమ్మతివాదులకు కొత్త ఊపిరి పోశాయి. శ్రీ జలగం వెంగళరావు కాంగ్రెస్ (ఐ) తరపున పి.సి.సి. అధ్యక్షుడిగా రంగ ప్రవేశంచేసి తెలుగుదేశంను ఇరుకున పెట్టడానికి చేస్తున్న యత్నాలవల్ల ఉత్పన్నమవుతున్న పరిస్థితిని తమకు అనుకూలంగా మలచుకోవడానికి వీరు ప్రయత్నిస్తున్నారు. మరోవైపు రామోజీ రావుకూడా వీరికి కొండంత అండగా నిలబడినట్లు తెలుస్తున్నది. అందువల్ల తె. దే. లోని అసంతృప్తి అగ్నిపర్వతం ఎప్పుడు బ్రద్దలవుతుందా అని ఇటు రాజకీయ పరిశీలకులు అటు ఇంటలిజెన్స్ వర్గాలవారు జాగ్రత్తగా గమనిస్తున్నారు.

ఒకప్పుడు రామారావును దేశ ప్రధాని చేసేవరకు విశ్రమించబోనని ఉత్తర కుమార ప్రతిజ్ఞ చేసిన మాజీమంత్రి హరిరామ జోగయ్య, బి. వి. మోహన్ రెడ్డి, పకీర్, రామారావుకు విశ్వాస పాత్రుడుగా ఉండికూడా అసెంబ్లీకి తిరిగి



ఉద్వాసనేనా ?

టిక్కెట్లు పొందలేకపోయిన లోగడ ఎం. ఎల్. ఏ. లు ఈ కార్యకలాపాలను నిర్వహిస్తున్నారు. శ్రీ రామారావు ప్రభుత్వంలో లోగడ మంత్రిగా ఉండి ఇప్పుడు కాంగ్రెస్‌లో చేరిన శ్రీ జీవన్ రెడ్డి మాజీ చీఫ్ విప్ ఎం. కేశవరావు వంటివారు వీరితో సన్నిహితంగా ఉంటూ పరిస్థితిని గమనిస్తున్నారు. అసమ్మతి వాదులు త్వరలో విజయవాడలో ఒక సమావేశాన్ని ఏర్పాటు చేస్తారని తెలిసింది. అయితే ముఖ్యమంత్రి మంత్రి వర్గ ప్రక్షాళన చేపట్టనున్నారని వార్తలు రావడంతో వారు తమ ప్రయత్నాన్ని వాయిదా వేసుకున్నారని అంటున్నారు. ఈ ప్రక్షాళనలో ముఖ్యమంత్రి శ్రీ మహేంద్రనాథ్‌ను, శ్రీమతి ప్రతిభా భారతిని, శ్రీ జానారెడ్డిని తొలగించి కొత్తవారిని తీసుకుంటారని అంటున్నారు. ఇది జరిగితే తమకు మరీ మంచిదని అసమ్మతివాదులు ఎదురు చూస్తున్నారు. అయితే ముఖ్యమంత్రి ఈ పని చేసి అసమ్మతి పెరగడానికి దోహదం చేయకపోవచ్చునని ప్రక్షాళనకు మరి కొంతకాలం ఆగవచ్చునని అనేవారు కూడా ఉన్నారు. అక్టోబర్‌లో జరగనున్న మహానాడునాటికి పార్టీలో అసమ్మతి వాదులను పథకం ప్రకారం ఏరివేసి పార్టీ ప్రధాన కార్యదర్శి పదవిని చంద్రబాబునాయుడుకు అప్పగించాలని ముఖ్యమంత్రి ఆలోచిస్తున్నారని తెలుగుదేశం పార్టీ వర్గాలవారు అన్నారు. ఒక వేళ అది అప్పటికి సంభవం కాక

—కొనసా 8వ పేజీలో

## 'దేశంలో' అసమ్మతి వాదుల ఏరివేత- ఆపిమ్మట కొత్త కార్యదర్శి నియామకం

### రామానాయుడు అవార్డు : పెద్దల సందేశాలు

# సన్మానానికి సీతారాం అన్నివిధాల అర్హుడు!

రామానాయుడుగారి జయంతి సందర్భంలో వచ్చిన సందేశాలను దిగువ ఇస్తున్నాము-

**ఆచార్య రంగా**

గౌరవనీయుడైన నా సహచరుడు, జమీందారీ విధానంనుండి రైతాంగానికి విముక్తిని ప్రసాదించిన రైతునాయకుడు ప్రేమపాత్రుడైన నెల్లూరు వెంకట రామానాయుడుగారి జయంతిని మీరు అత్యంత శ్రద్ధాభక్తులతో, క్రమం తప్పకుండా జరుపుతున్నందుకు నా హృదయ పూర్వక అభినందనలు.

అనేకమంది ఇతర స్వాతంత్ర్య వీరులవలె రామానాయుడుగారు కూడా స్వాతంత్ర్య పోరాటంలో తనవంతు కీలకమైనపాత్రని నిర్వహించారు. కాంగ్రెస్ శతవార్షిక సందర్భంలో వారిసేవలు గుర్తుకువస్తున్నవి.

ఈ సందర్భంలో ప్రఖ్యాత జర్నలిస్టు సీతారాంను సన్మానిస్తుండటం ముదావహం.

**వెంకటనారాయణరెడ్డి**

శ్రీ బద్దెపూడి వెంకటనారాయణరెడ్డి- రామానాయుడుగారి జయంతి సందర్భంలో ఒక జర్నలిస్టును సన్మానించు



డి. సీతారాం

టకు తగిన ఏర్పాటుచేసిన శ్రీ మల్లెమాల సుందరరామిరెడ్డిని అభినందిస్తున్నాను. సభాధ్యక్షులు శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య నాకు చిరపరిచితులు; కావున నవ్యులుగా మద్రాసులో సహచరులు. ప్రయాణించే ఆరోగ్యంకూడా లేనందువల్ల జయంతి సభలో పాల్గొనలేకపోయినందుకు, నెల్లూరుకు విచ్చేసిన వెంకటసుబ్బయ్యగారిని కలుసుకోలేకపోతున్నందుకు మన్నించవలసిందిగా నా పక్షమున వారికి మనవిచేయండి.

నాయుడుగారిని జమీన్ రైతులు జమీందారీ రద్దు చట్టము వచ్చినపుడు జీవించియున్న వారందరూ స్థిరముగ స్మరించుకుంటూనే వుండగలరు.

**విద్వాన్ విశ్వం**

ఈ సంవత్సరం శ్రీ సీతారాం రామానాయుడు అవార్డు స్వీకరిస్తుండడం ముదావహం. నాకు మిత్రుడైన సీతారాం ఈ సన్మానానికి ఎంతైనా అర్హుడు. నా మిత్రుడు, సహృదయులైన శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య సభకు అధ్యక్షత వహిస్తుండడం నిజంగా సంతోషదాయకం.

—కొరవ 11వ పేజీలో



## పినాకినీ తీరం

### వ్రాతగాళ్ళు కూతగాళ్ళు కాలేరు!

వ్రాతగాళ్ళు కూతగాళ్ళుకూడా కావడం చాల అరుదు; కొందరు అనర్గళంగా ఉపన్యసించలేకపోయినా, ఆలోచిస్తూ నిదానంగానైనా ఏదో మాట్లాడాననిపించుకో గలుగుతారు, కొందరైతే కాగితం మీద పులులేకాని, వేదిక ఎక్కేసరికి పిల్లులే! వ్రాతకు, మాటకు ఎంతో తేడా. వ్రాతంటే పెద్దగ మడిచిన నిరుపహతి స్థలంకాకపోయినా, నాలుగుగోడలమధ్య, టేబిల్ముందు కుర్చీలో కూర్చొని నిమ్మళంగా వ్రాసుకుంటూ కొట్టేసుకుంటూ అనుకున్నభావం స్పష్టంగా వున్నదనిపించేంతవరకు గుబ్బగా వ్రాసుకోవచ్చు; అచ్చులోకివచ్చేవరకు అబ్బ అనిపించుకోవచ్చు. కాని ఉపన్యసించడానికి లేస్తే కలంసాగినట్లు మాటలుసాగవు; వ్రాతలో భావాలు పరుగెత్తినట్లు మాటల్లో పరుగిడవు. అందువల్లనే వ్రాతగాణ్ణి కూయమంటే; మాటపెకలదు, అందువల్లనే ఉత్తమ జర్నలిస్టుగా పేరు ప్రఖ్యాతులు పొందినవ్యక్తి, వేదిక ఎక్కితే ఇంతేనా అనిపించుకోవలసివస్తుంది.

రాజకీయవాదులకు, జర్నలిస్టులకు ఉపన్యాస విన్యాసంతోవుండే తేడా మొన్న 3 తేది జరిగిన రామానాయుడుగారి జయంతిసభలో కొట్టొచ్చినట్లు కనపడింది. అధ్యక్షతవహించిన మాజీ కేంద్రహోంశాఖ స్టేట్‌మంత్రి, ప్రస్తుత బీహారు గవర్నరుఅయిన శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య జర్నలిజము-జర్నలిస్టులనుగూర్చి ఉపన్యాసందంచిపారేశారు; చక్కని నిర్మాణాత్మకమైన ప్రసంగం అది. పత్రికారంగంలో విశేషానుభవం గలిగిన శ్రీ డి. సీతారాంగాని, శ్రీ వి. జి. ప్రసాదరావుగారలుగాని తమఅనుభవాలను, పత్రికావిలేఖరి వృత్తిలోని సాధకబాధకాలను, కష్టసుఖాలనుగూర్చి ధాటిగా మాట్లాడలేకపోయారు. వీరిద్దరు తమ ప్రసంగాలను లిఖితంగా వ్రాసి చదివివున్నా బాగుండేదనిపించింది. అట్లా చేయనందువల్లనే విలేఖరులుగా వారి నాలుగుదశాబ్దాల విలువైన అభిప్రాయాలను తెలుసుకునే అవకాశం జర్నలిస్టులకు లేకుండాపోయిందేమోననిపించింది.

### గవర్నరు పదవిని చులకన చేశారు!

అధికార గౌరవమర్యాదల తతంగపు (ప్రొటోకల్) నియమనిబంధనలు నాకు తెలియవు. కాని ఒక రాష్ట్రగవర్నరు నెల్లూరుకు వస్తుంటే ఆయనను 'రిసీవ్' చేసే కనీసబాధ్యత లేదా మర్యాద కూడా కలెక్టరు వంటి అధికార్లకు లేదా అనే ధర్మసందేహం నాకు కలిగింది.

శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య అధికార కార్యక్రమం రాకపోయినా, గవర్నరు గవర్నరే; పతిసమేతంగా వచ్చిన గవర్నరుకు గెస్టుహౌస్‌వద్ద స్వాగతం చెప్పే తీరిక కలెక్టరమ్మగారికి లేకపోయింది; ఆయన అకస్మాత్తుగా రాలేదు; ముందు కార్యక్రమంప్రకారమేవచ్చారు. అయినా ఆమె ఆరోజుకూడా అనివార్యం కాకుండా అటునుంకూడా ఏదో 'కాన్ఫరెన్సు' పెట్టుకున్నట్లుంది; దాన్ని పూర్తిచేసుకొని వచ్చి గవర్నరుగారిని కలుసుకొని పోయిందట. జాయింట్ కలెక్టరుగారుకూడా రాలేదు; నయం, ఏ రెవెన్యూ ఇన్స్పెక్టరో కాకుండా ఆర్. డి. ఓ. గారైనా వచ్చారు; అట్లనే ఎస్. పి. గారు సెలవట; అడిషనల్ ఎస్. పి. గారు హాజరైనారనుకోండి.

అదే గవర్నరు హోదాలోవున్న వెంకటసుబ్బయ్యగారు ఏమి చేశారో తెలుసా? కలెక్టరు సుజాతారావుగారి తండ్రి డాక్టర్ కె. ఎల్. రావుగారి పట్ల వున్న పూజ్యభావంతో, ఒక మామూలు పౌరుడుగా కలెక్టరు బంగళాకు పోయి ఆయన్ను చూచివచ్చారు. మర్యాదంటే అదీ మర్యాద! అధికార దర్పాన్ని ప్రదర్శించడంలో గొప్పతనంలేదు; గౌరవమూ ఇనుమడించదు.

ఇంతకూ అధికార్ల దృష్టిలోకూడా చులకనైపోయిన గవర్నరు పదవులు ఇంకా కొనసాగడం వ్యక్తులకుగాక ఆ పదవులకే న్యూనతకాదా అనిపిస్తుంది. గవర్నర్లపట్ల ముఖ్యమంత్రి రామారావుగారి వైఖరికి నెల్లూరు అనుభవం అనుగుణంగానేవుంది.

—కొరవ 11వ పేజీలో

# జమీన్‌రైతు

## ధాన్యం రవాణా

జిల్లాలమధ్య ధాన్యంరవాణాకు వున్న నిర్బంధాలను రద్దుచేస్తున్నట్లు రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. అంటే ఇకముందు మన రాష్ట్రంలో ధాన్యం రవాణా స్వేచ్ఛగా జరిగిపోవచ్చునన్నమాట. దీనివల్ల రైతుకు తాము మహోపకారం చేస్తున్నట్లు ప్రభుత్వం భావిస్తున్నది.

కాని దీనికి సంబంధించి ఇంతవరకు వుత్తర్వులు వచ్చినట్లులేదు. ఒకవేళవచ్చినా ఈ సౌకర్యంవల్ల రైతులకు ఎంతవరకు లాభంచేకూరుతుందో అనుమానమే. ఇప్పటివరకు ధాన్యానికి ధర లేదు. అవసరంకొద్దీ సామాన్యరైతు తన ధాన్యాన్ని తెగనమ్ముకొన్నారు. సాధారణంగా ప్రతి సంవత్సరం పెద్దరైతు తనకువచ్చే ధాన్యాన్నేకాక, అన్యంగా ఎక్కువ ధరకు అమ్ముకొని అధికలాభాన్ని పొందవచ్చుననే వుద్దేశ్యంతో ఇతరుల ధాన్యాన్నికూడాకొని నిల్వచేసేవారు. రెండుసంవత్సరాల క్రితంఅలాంటి రైతులు రెట్టింపులాభాలు పొందారు. కాని ఈ సంవత్సరం దెబ్బతినిపోయారు; సంవత్సరం తర్వాత కొన్నధరకు అమ్ముకోవలసివచ్చింది. అందువల్ల ఈ సంవత్సరం అటువంటి పెద్దవారుకూడా మసూలుకాగానే అమ్మేసుకున్నారు. అందువల్ల రైతులవద్ద ప్రస్తుతం ధాన్యంలేదు. సర్కారుజిల్లాలలో కూడా దాళ్వాధాన్యం వస్తేతప్ప పాతధాన్యం వుండదు. ఈ కారణంగా జిల్లాలమధ్య ధాన్యం రవాణామీద నిషేధాన్ని తొలగించినందువల్ల రైతులకు ఒరిగేదేమీ లేదేమోననిపిస్తుంది.

కారణమేదైనా కొన్నిచోట్ల తక్కువధరకావచ్చు, కొన్నిచోట్ల ఎక్కువ కావచ్చుకాని అన్నిజిల్లాల్లో ధాన్యంపండుతున్నది. అదీకాక కిలో రెండు రూపాయల బియ్యం పూర్తిగా పుష్కలంగా సంభరమవుతున్నది; అవి యథేచ్ఛగా చీకట్లో మార్కెట్‌కుకూడా వస్తున్నవి. అటువంటప్పుడు ఏ జిల్లాలో అయినా ధాన్యానికి గిరాకీవుంటుందని, రాష్ట్రంలో జిల్లాలమధ్య రవాణా నిర్బంధాలు తొలగించినందువల్ల రైతులకు ప్రయోజనముంటుందని, వాస్తవికానుభవం కలిగినవారెవరూ భావించలేరు. పైగా దీనివల్ల నెల్లూరు వంటి జిల్లాలకు ఒకవిధంగా నష్టంకూడావుంటుందా అనిపిస్తుంది. గోదావరి వంటి సర్కారుజిల్లాల్లో దాళ్వాపంట విపరీతంగావస్తుంది. అక్కడ ధాన్యానికి అంత ధరవుండకపోవచ్చు. వ్యాపారస్తులు ఆ ధాన్యాన్ని నెల్లూరువంటి చోట్లకు దిగుమతిచేశారంటే, ఇక్కడిరైతు గోడౌనులు పెట్టవలసిందే. అంతర్‌జిల్లా రవాణారద్దు రైతులకంటే, మిల్లర్లకు; వ్యాపారులకే లాభదాయకంగా పరిణమించవచ్చు. పూర్వం నెల్లూరు ధాన్యానికి కడప, ప్రకాశం జిల్లాలలో గిరాకీవుండేది; ఇటీవల అదికూడాలేదు; రవాణా నిర్బంధాల రద్దువల్ల తిరుగా గిరాకీ వస్తుందనే నమ్మకంలేదు.

నెల్లూరుజిల్లా రైతాంగానికి శాస్త్రీయంగా లాభంచేకూర్చాలంటే మద్రాసు, కర్నాటక రాష్ట్రాలకు రవాణాపైవున్న నిషేధాలను సడలించడమొక్కటే మార్గం. ఆ రాష్ట్రాలుకూడా పూర్వంవలె తెలుగురాష్ట్రాలుకాదు; అందువల్ల ఇదివరకటి గిరాకీవుండదు. కాని గ్రుడ్డికంటే మెల్ల శ్రేష్ఠం అన్నట్లు, నెల్లూరు వ్యాపారుల దయాదాక్షిణ్యాలే శరణ్యంకాకుండా, రైతులు తమధాన్యాన్ని అమ్ముకోడానికి రెండవమార్గం దొరుకుతుంది. రాష్ట్రప్రభుత్వం ఈ సౌకర్యం కల్గించగలిగితేనే రైతులకు వుపకారం చేసినట్లులెక్క. అధికారం కేంద్రందని వింతదానిమీదతోసి, రాష్ట్రప్రభుత్వం తప్పించుకోదలిస్తే రైతులు నమ్మేస్థితిలోలేరు. గతంలో అంజయ్యగారు నెల్లూరు రైతాంగానికి, పర్మిట్‌పద్ధతిలో ఎంతో సహాయంచేశారు. అందువల్ల రైతులకు తమధాన్యాన్ని కనీసం మద్రాసుపంపుకునే వెసలుబాటుకల్గించగల్గితేతప్ప 'రైతన్న' శ్రేయస్సుపట్ల 'రామన్న'కు చిత్తశుద్ధి వున్నట్లు భావించలేము.

# ఇక ఖద్దరు కొనగలమా?

రెండు చొక్కాలు, ధోవతులు కొందామని మొన్న ఖద్దరు షాపుకుపోతే ధరలు చూచి గుండె పగిలింది. నేను రెండేళ్లుగా అంగడికి పోలేదు; అందువల్ల ఈ సంగతి తెలియదు.

ఏప్రెల్ 1 తేది ధరలు పెంచారట; గుడ్డ లావు సన్నాన్నిబట్టి ఇరవైశాతం మొదలు యాభైశాతంవరకు పెంచబడ్డాయట. పొందూరు షర్టింగుకాని, ధోవతులుకాని మామూలుగానే ఖద్దరుధారికి అందుబాటుకావు, అందువల్లనే ఆ పంచలకు ఎం.ఎల్.ఎ. ధోవతులనే మారుపేరుకూడా వచ్చింది. ఇప్పుడవి ఎం.ఎల్.ఎ.లకుకూడా అందుబాటులోవుంటాయని నేననుకోను. పొందూరు జరీపంచ ఒక్కదానిమీద సుమారు రూ 140 లు ధర పెరిగిందట!

చొక్కాగుడ్డ, అరచేతిమందావుండే ధోవతుల ధరలుసైతం మండిపోతున్నాయి. రిబేట్ లేకుండా ఒక చొక్కాబట్టకు యాభై అరవై రూపాయలు; ఏనిమిది మూర మూతక ధోవతి డెబ్బయ్ రూపాయలు; ఈధరలతో ఖద్దరును ఎంతమంది కొని కట్టుకోగలుగుతారు? ప్రభుత్వం పరోక్షంగా ఖద్దరుధారణను నిరుత్సాహ పరచడం, సూనపురి చెప్పడం తప్ప. ఒక్కసారి ధరలు ఇంతగా పెంచడంలో అర్థమేమిటి? నేత మజూరీలు పెరిగాయనుకుంటే, సబ్సిడీవంటి ప్రత్యామ్నాయపు మార్గాలద్వారా ఖద్దరు ధరలను కాస్త అందుబాటులో వుంచడం న్యాయంకాని, కేంద్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం వుండీ ఖద్దరు వ్యాప్తికి స్వస్తి జరిగే చర్యలు తీసుకోవడం శోచనీయం కాదా?

త్రాగుడువలెనే ఖద్దరుధారణకూడా కొందరికి ఒక వ్యసనం. వారు ఖద్దరు తప్ప మరొకగుడ్డ కట్టుకోలేరు. అటువంటివారు ఇప్పుడేమిచేయాలి? నాలుగైదు దశాబ్దాలుగా ఖద్దరు ప్రచారాన్ని పాటించి, ఇప్పుడు దానికి తిలోదకాలిచ్చి, ప్రాణంపోయినా చేనేతవంటి ధరతక్కువైన గుడ్డలకు మారాలా? లేక ఖద్దరు కంటే ధర ఎక్కువలేకుండా, మన్నికలో వాటికంటే అధిక్యతకలిగి, అందంగా వుండే మిల్లుగుడ్డలకు పోవాలా? పలుకుబడిగలిగిన కాంగ్రెస్ నాయకులు ఖద్దరు ధరలు మరీ ఎక్కువకాకుండా సామాన్యులకికూడా అందుబాటులో వుండేట్లు ప్రయత్నించాలని నా విజ్ఞప్తి.

నెల్లూరు —ఒక ఖద్దరువాలా

## జనవాణి

### వటబీజం నిర్లక్ష్యం చేయతగినదికాదు!

వటబీజంవంటి చిన్న అపరేషనును ప్రజలు సాధారణంగా నిర్లక్ష్యం చేస్తుం

—కొరవ 10 వ పేజీలో

## మేము-మీరు

### ఆర్. ఎల్. రెడ్డి. సంపద

ఆర్ ఎల్ రెడ్డిని అవమానించడం న్యాయమా (మే 31 తేది) అని శ్రీ ఏటూరి రామానుజస్వామి లేఖ క్రింద సంపాదకుని వివరణ వుంటే బాగుండేది. ఇందువల్ల ఆయన మాటలు యథార్థమని భ్రమకల్గే అవకాశంవుంది.

ఆర్ ఎల్ రెడ్డి తన ఆస్తికి తాను ధర్మకర్తగా విల్చారన్నారు. కాని, ఆయన ఎప్పుడూ అట్లా అనుకునేవారు కాదు; అనుకొనివుంటే భవిష్యత్ ను గురించి ఎంతో కాలజ్ఞానం కల్గిన ఆయన తన ఆస్తిని సమాజపరంచేసివుండేవారు. రెడ్డిగారి మరణానంతరం వారి ఆస్తులు కుక్కచింపినవిస్తరి కావడం దేన్నిసూచిస్తుంది?

ఆర్ ఎల్ రెడ్డిగారు డబ్బు వడ్డీకి ఇచ్చేవారన్నది అందరికీ తెలిసినదే; కొందరు పెద్దమనుషులు వారికి స్నేహితులుగా వుంటూ వారివద్దనుంచి లక్ష

—కొరవ 10వ పేజీలో

## జమీన్ రైతు

(7-6-1935 సంచిక నుండి)

### 59 ఏళ్ల క్రితం ఈవారం

### నెల్లూరు డైరీ

ఈ జిల్లాలో వెంకటగిరి పాలనను ప్రవేశపెట్టి గల్పాబట్టించిపోయిన పంచాయతీ ఆఫీసరు రామనాధంగారు తిరుగా కృష్ణాజిల్లా నుండి ఇక్కడికి రావడానికి ప్రయత్నిస్తున్నారట. అక్కడా గల్పాబట్టి!

○○○

తనకు సంబంధించిన రూ 15/-లకు బాడుగ యివ్వతగిన యింటిని రూ 30/-లకు అనాధ శరణాలయానికి అద్దెకిచ్చి దేశభక్తి వెల్లడిస్తున్నాడట దండాయుధం పిళ్ళెగారు.

○○○

జిల్లాలో పెద్దకేసులుపడితే పోలీసువారితో పలుకుబడివుందని ఒక పార్టీవారు ఈదూరు రామచంద్రారెడ్డిగారి దగ్గరకు, మరొకపార్టీవారు ఈపూరు బలరామరెడ్డిగారిదగ్గరకు పొయ్యేవారు విసార్పులేకోవం. ఆ పోలీసులే మొన్న ఈపూరు బలరామరెడ్డిగారిని అరెస్టుచేసి నాలుగుమైళ్ళు నడిపించినప్పుడు దాని యథార్థం లోకానికి తెల్పినట్లేదా?

○○○

జిల్లాబోర్డులో ఖాళీపడిన వెంగన్న సీటుకు నోరూ, వాయీలేని దద్దన్నలను పంపి తంత్రాకుల లాభాలు దక్కేట్లు చేసేదానికంటే నోరు గట్టి విషయాన్ని బైటపెట్టి గోలచేసేదానికి వకీలు ముంగమూరు విశ్వనాధరావుగారిని పిలిపిస్తే బాగుంటుందని చాలామంది అంటున్నారు, ఆలోచించండి ఆ ఫిర్కావారు.

○○○

వ్యాపారానికి భాగస్తులు దొరికితే వెనుక ధావుకొట్టినబుజ్జయ్యనాయుడుగారు నిలవడానికి పూనుకొంటాడట; రుచిమరగినవారు ఊరుకుంటారా? కాపీ పోటీకి కాసులురాల్చేవారేరీ?

# పెండ్లిండ్లు

## మద్దాలి పెండ్లి

వ్యాయవాద ప్రముఖుడు, సాహిత్య ప్రియుడు, స్నేహశీలి శ్రీ మద్దాలి మల్లికార్జునరావు అన్నిపాస్తులకేకాక వృత్తికి కూడా వారసుడైన కుమారుడు, లాయరు ఎం. వి. సుబ్రహ్మణ్యం; శ్రీ ఏ. వి. సుబ్బారావు కుమార్తె లక్ష్మి బి. కాం. పరిణయం 29 తేది పొన్నూరులోని వధువు ఇంట జరిగింది.

## వివాహం కాదు– వసంతోత్సవం!

బుచ్చిరెడ్డిపాలెం వాసి, పారిశ్రామికుడైన శ్రీ ఇ. రాఘవరెడ్డి తన కుమార్తె డాక్టర్ శైలజను; నెల్లూరు, శ్రీ కొండా రామరెడ్డి కుమారుడు డాక్టర్ విజయ్‌తో 24 తేది శ్రీ వెంకటేశ్వర కళ్యాణమండపంలో వివాహం జరిపారు.

రాఘవరెడ్డి దాన్ని కేవలం వివాహంగా కాకుండా ఒక వసంతోత్సవంగా జరిపారు. నృత్తమాలికలు గల యువకులుగా కనపడతారు; టీలు, డిన్నర్లే కాదు. డాక్టర్ వెంపటి చిన సత్యం బృందంవారి శ్రీకృష్ణ పారిజాతం నృత్యనాటకం ద్వారా వసంతమైన కళానందమునుగూడా గావించారు.

## జయరామరెడ్డి కుమార్తె

బొగ్గు గనుల కార్మికశాఖ ప్రాంతీయ కమీషనర్‌గా ప్రస్తుతం అసన్‌సోల్‌లో వున్న మిత్రుడు; ఉద్యోగధర్మం, విజ్ఞాన సముపార్జనకన్న మరో వ్యాసంగం లేని విద్యార్థియుడు, ముక్కుసూటి పెద్దమనిషి శ్రీ సి. జయరామరెడ్డి కుమార్తె; అంటే శ్రీ కాకాని రమణారెడ్డి (పాకల కూడ మాజీ సమితి రాజా కాదు) దౌహిత్రి గాయత్రి; శ్రీ అత్తినరసు ఏకాంబరామరెడ్డి–స్వర్గీయ మోహనమ్మ కుమారుడు వెంకటరాం వివాహం 30 తేది టి టి డి కళ్యాణ మండపంలో జరిగింది.

ఈ సందర్భంలో అద్భుతమైన వెంకట్ 31 తేది రాత్రి టవున్‌హాలులో విందు చేశారు.

## విద్యుత్ వివాహం

సౌమ్యుడు, సహృదయుడైన విద్యుచ్ఛక్తిశాఖ సూపరింటెండింగు ఇంజనీరు బి. బలరామరెడ్డి తనయుడు ఎలక్ట్రికల్ ఇంజనీరుగానే భోపాల్ బి. హెచ్. ఇ. ఎల్. లో వున్న రవికృష్ణ; హైదరాబాదు, శ్రీ బి. కృష్ణారెడ్డి తనయ జయంతి వివాహం 25 తేది హైదరాబాదు బక్కల్ పురాలోని ఆంధ్ర యువతీ మండలిలో జరిగింది. ఈ సందర్భంలో శ్రీ బలరామరెడ్డి నెల్లూరు కక్కల్‌స్టేషనులోని తన అధికార నివాసంలో రిసెప్షన్ ఇచ్చారు.

పెళ్ళికి నెల్లూరు విద్యుత్ శాఖ యావత్తూ హైదరాబాదు తరలిపోయిందా అనిపించింది.

## కొత్రా మనుమడు

నెల్లూరులో 'కొత్రా' పేరుతూనా చెప్పవలసిన అవసరం లేనంత జగమెరిగిన బ్రాహ్మణుడు, శ్రీ ఆదిశేషయ్య మనుమడు, అంటే పి. టి. ఐ. విలేఖరి శ్రీ సీతారామమూర్తి కుమారుడు వెంకట కృష్ణమూర్తి బి. ఎ.; స్వర్గీయ మహంకాళి వెంకటకృష్ణమూర్తి కుమార్తె లలిత (బి. ఎ.) వివాహం 29 తేది గూడూరు టి టి డి సత్రంలో జరిగింది.

## డాక్టరు పెండ్లి

కంటి డాక్టరుగా కొత్తగా ప్రాక్టీసు ప్రారంభించిన శ్రీ ఆర్. వి. సుబ్రహ్మణ్యం; శ్రీ గుమ్మడాల వెంకటరమణయ్య కుమార్తె వసంతకుమారి బి.ఎస్‌సి. 29 తేది రామమూర్తినగర్‌లో వధువు ఇంట వివాహమాడాడు.

## గూడూరు పెండ్లి

శ్రీ ఎం. వి. కృష్ణారెడ్డి కుమార్తె భాగ్యలక్ష్మి బి. ఎ., కొత్తకోడూరు శ్రీ కె. వీరారెడ్డి కుమారుడు ఆదిశేషారెడ్డి బి. కాం. (పి. ఎ) పరిణయం 29 తేది గూడూరు జి.వ. బాలుర హైస్కూలులో జరిగింది.

## ఉప్పెనా... నీవో పెనుభూతానివి!

—కె. ఆదిశేషయ్య

ఆలిండియా రేడియోలో
తుపాను హెచ్చరిక వచ్చిందంటే
గుండె పట్టుకొంటున్నాది
దిగులు ముంచుకొస్తున్నాది.

దివిసీమవాసుల దీనాలాపాలు
కన్నాక.... విన్నాక
తెలిసొచ్చింది.... తలుకొచ్చింది
ప్రకృతంటె ఏమిటో....
ఉప్పెనంటె ఏమిటో

వేలాది ప్రాణాలు బలిగొన్న
కోపాల విషవాయువు,
నెల్లూరుజిల్లాను నేలరాచిన
సకల బీభత్సం,

పీటన్నిటినీ మించి పుట్టించావు,
ప్రళయతాండవం చేశావు,
బంగాళాదేశాన్ని గడగడలాడించావు,
లక్షలాది ప్రాణాలను పొట్టనబెట్టుకున్నావు
ఉప్పెనా.... నీవో పెనుభూతానివి,

## తెలుగుగంగ పెండ్లి

నెల్లూరు ఆర్. ఐ. గా నెల్లూరు ఆర్-అండ్-బి గెస్టుహౌస్ సేవలో వర్కీసును తరింపజేసుకొని, ప్రస్తుతం డిప్టీ కానిస్లాతుగా తెలుగుగంగలో పవిత్ర స్నానంచేస్తూ, నిరిహా 'సోమయాజిత్వం' ఎదురుచూస్తున్న శ్రీ అక్కరాజు రఘురామయ్య కుమార్తె హేమలత (బి ఏ); కీ॥శే॥ చుండి సుబ్బారావు కుమారుడు వెంకట నాగేంద్రకుమార్ పెండ్లి 29 తేది ఏ సి, నగర్‌లో వధువు ఇంట జరిగినది.

## పురిణి పెండ్లి

పురిణి - శ్రీ మారంరెడ్డి వెంకటరెడ్డి కుమారుడు; అంటే పొట్లపూడి-1930 సత్యాగ్రహంలోనే జైలుశిక్ష అనుభవించిన దేశభక్తుడు స్వర్గీయ మారంరెడ్డి శేషురెడ్డి మనుమడు మధుసూదనరెడ్డి; ముదివర్తి, శ్రీ తిక్కవరపు రామచంద్రారెడ్డి కుమార్తె వసుమ వివాహం 25 తేది మాదాల బాలతిమ్మయ్య కళ్యాణ మండపంలో జరిగింది.

## చెర్లోపాలెం పెండ్లి

చెర్లోపాలెం-శ్రీ ఎగ. లక్ష్మీనారాయణరెడ్డి కుమారుడు శ్యాం; నెల్లూరు, శ్రీ మాగుంట గోపాలరెడ్డి కుమార్తె స్మిత, వివాహం 30 తేది శ్రీ కస్తూరిదేవి విద్యాలయంలో జరిగింది.

## తిరుపతి వివాహం

చిత్తూరు స్పెషల్ ఇన్వెస్టిగేషన్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా వున్న నెల్లూరీయుడు శ్రీ పి. రాజగోపాలయ్య కుమార్తె, విద్యావతి సౌజన్య ఎం. ఎస్‌సి., సూళ్లూరు

–రాతన 11 పేజీలో.



# గ్రంథ సమీక్ష

## రఘువీరగాథ

[భోజదేవుని చంపూ రామాయణమునకు తెనుగు వచనానువాదము. అనువాదకులు: శ్రీ కేసరి సుందర రామశర్మ. గ్రంథ మూల్యం: రు 15-00 లు. ప్రాప్తి స్థానము. రచయిత, జనతాపేట, కావలి-524202.]

మధురాతి మధురమైన రామకథను వాల్మీకి కోకిల కర్ణపేయంగా గానం చేసింది. ఆ గానంలో బ్రహ్మపద విహారిణి అయిన వైదికవాణి విపదించింది. బ్రహ్మపదావతీర్ణ కవితాలీనాపతి వల్లభుడైన వాల్మీకి వాక్కులో ఉద్భవించిన శ్రీరాముడు ప్రపంచానికే మోహనరూపుడైనాడు, ఎందరో కవులు ఆ రామకథా సుధాపరివాహంలో స్నానాలుచేసి తమ జన్మల్ని చరితార్థం చేసుకున్నారు. పురుషార్థ సాధనకు అనువైన భగవత్కథగా కొందరు కవులు భావించారు. వాల్మీకి "తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్" అని రామాయణంలో తపస్య ప్రకాశ చరిత్రలున్నాయన్నారు. వాల్మీకి రామాయణంలో గుప్తంగా వున్న వైదికవిజ్ఞానాన్ని వెలువరచడమే పరమార్థంగా కొందరు ప్రాచీన తాత్త్వికకవులు భావించారు, ఇక కావ్య, రూపక కర్తలకు సరసమైన విందుగా పూచిన నందనవనంగా వాల్మీకి రామాయణం కన్పించింది. వారు అందుకొని రమణీయార్థాలను భావించి తన్మయులయ్యారు. తత్ఫలితంగా భారతీయ భాషా దర్పణాలన్నిటిలోనూ శ్రీరాముని మోహనరూపం అనేక విధాలుగా ప్రతిబింబించింది. ఆ చిద్రూపుని విశ్వరూపం జ్ఞానజ్యోతులను వెలిగించి తమస్సులను చీల్చివేసింది; ధార్మికతను పండించింది.

మర్యాదా పురుషోత్తముడైన శ్రీరాముని గుణగణాలను మృగ్యమైన సంస్కృత కావ్య, పురాణ, నాటక కవులు రామకథను ఎన్నో విధాలుగా గానంచేశారు. భట్టమూరారి అన్నట్లు సత్పథగుణ సంపన్నుడైన శ్రీరాముని వర్ణించకుండా, అయోగ్య గుణ భీక మధుర గుణస్పృతల వాగ్విభ్రమాలైన కవులు వారి వాగ్విభవాన్ని ఎలా సద్వినియోగం చేసుకుంటారు? రామకథను కీర్తించిన కవుల్లో భోజకవి ఒకడు.

భోజమహాకవి రామకథను సంస్కృతంలో చంపువుగా సుందరకాండ వరకు రచించాడు, యుద్ధకాండను లక్ష్మణకవి రచించాడు. భోజకవి గొప్ప భావుకుడు, ఆయన భావనావేశాన్ని అందుకోవడానికి కథకూడా పరుగెత్తింది ఈ చంపూ కావ్యంలో, ఆ పరువులెత్తడంలో కథకు అలసట లేదు! పైగా దివ్యమగంధమును మాలను వెదజల్లుతూ పరుగెత్తింది, అనుమాల్లో ఉత్ప్రేక్షల దిరిసెనలు, ఉపమల మల్లెలు; అర్థాంతరన్యాసాలపద్మాలు; స్వభావోక్తులపన్నాగాలు ఎన్నో అనుమసౌరభాలను వివరించేందుకు శబ్దశక్తి చాలదు, ప్రత్యక్షంగా అనుభవించి తరించాల్సిందే.

శ్రీ కేసరి సుందరరామశర్మగారు భోజ చంపువును లలిత గ్రాంథిక వచన రూపంలో అనువదించారు. ఉభయభాషా ప్రవీణులు; భావుకులు; తాత్త్వికులు. అందుచేత వారి అనువాద వచనం లలితమై మనోహరమై భాసించింది. రమణీయమైన మూలాన్ని మధురమైన తెనుగున పంతరింపజేశారు శ్రీ శర్మగారు. సహృదయులందరూ శ్రీ శర్మగారి రచన రసస్ఫూర్తిని, ఎల్లరూ అనుభవించి ఆనందింపతగినది.

—డాక్టర్ జె. వి, సుబ్బరాయుడు

# అరుదైన చిరుతపులి హతమైంది!

అత్యంత అరుదైన చిరుతపులి ఒక దానిని 21 తేదీ సాయంకాలం కావలి తాలూకా చెన్నాయపాలెం గ్రామస్థులు వధించారు. 7 అడుగుల పొడుగు, 40 అంగుళాల ఎత్తువున్న ఈ పులి పాంథర్ జాతికి చెందినదట.

దాదాపు నెలరోజులనుంచి చిరుతపులి ఒకటి కావలి తీరప్రాంతాలలో తిరుగుతున్నదన్న వార్తలు వస్తుండినాయి. అది అప్పుడప్పుడు తీరగ్రామాలలోకి ప్రవేశించి, పశువులను ఎత్తుకపోవడం కూడా జరిగింది. ఈప్రాంతంలో జీడిమామిడితోటలు ఎక్కువగా వుండడంతో, ఈ పులికి సహజసిద్ధమైన మరుగుఏర్పడింది.

తోటలలో పులి సంచరిస్తుందన్న వార్తలు వినగానే జిల్లా అటవీశాఖాధికారులు దానిని సజీవంగా పట్టుకోవడానికి విఫలయత్నం చేశారు. ఎన్నిసార్లు ఎత వేసినా ప్రయోజనం లేకపోయింది.

ఈలోగా చెన్నాయపాలెంగ్రామ పొలిమేరలలో, వరిపొలాలలో ఈ పులి సేదదీరుతుండడం గ్రామస్తులు చూశారట, వారు అధికారులకు తెలియజేయకుండా, 50, 60 మంది గుంపుగా కర్రలు, బరిసెలు పట్టుకుని ఒక్కసారిగాపోయి దాడిచేశారట. పొలంలో నీళ్ళునిల్చి బురదగా వుండడంవల్ల పాపమాపులి తప్పించుకొనిపోలేకపోయింది. అప్పటికీ ఉగ్రంగా లేచి, ఒక వ్యక్తిపైకి పంజావిసిరిందట. కానీ మూకబలంముందు దానిఒంటరిశక్తి నిర్వీర్యమైపోయింది. గ్రామస్తుల ఉద్రేకంలో ఇష్టంవచ్చినట్లు బాదడంవల్ల తలపైన వీపుపైన బలమైన గాయంతగిలి అది అక్కడికక్కడే చనిపోయింది.

ఈ వార్త తెలియగానే కావలి ఫారెస్టు రేంజర్ శ్రీ సత్యనారాయణ చెన్నాయపాలెంవెళ్ళి పులిమృతదేహాన్ని కావలికి తీసుకుని వచ్చారు. తర్వాత కలెక్టర్ సుజాతారావు, జిల్లా ఫారెస్ట్ అధికారి డి. రామకృష్ణారెడ్డి తదితరులు దాని మృతదేహాన్ని సందర్శించారు.

ఈ పులి మగదట, అయితే, కేవలం మూడేళ్ళ వయస్సుగల పడుచు కావడంతో, పాపం ఇంకా పొలుసులుకూడా పూడలేదట, పురుషావయవాలు కూడా పూర్తిగా ఏర్పడలేదట. చాలా అరుదైన పులిసంతతిగా దీన్ని భావిస్తున్నారు. సజీవంగా దొరికివుంటే, వన్యమృగాభిమానులు ఎంతో సంతోషించివుండేవారు. కానీ గ్రామస్తుల ప్రాణభయం, దాని ప్రాణం తీసింది.

ఫారెస్టు అధికారులు ఇప్పుడీ పులి చర్మాన్నితీసి హైదరాబాదు జూకు పంపుతున్నారు. రెండుమూడునెలలక్రితం కరదగ్గర చవటతోపుల్లో కన్పించిన పులి ఇదిగానే వుండవచ్చునని భావిస్తున్నారు. ఏడెనిమిది నెలలకుముందు వెంకటాచలం పౌల్‌క్యాబిన్‌వద్ద గాండ్రించిందికూడా ఇదిగానే వుండవచ్చునని ఒక అనుమానం

—కొరవ 7వ పేజీలో

## జిల్లా వార్తలు

# జిల్లాలో విద్యుత్ సరఫరా-వివిధ ప్రాంతాల పరిస్థితి

గతవారం జిల్లాలో విద్యుచ్ఛక్తి పరిస్థితిగూర్చి విన్న విషయాలు వ్రాశాము కొన్నిచోట్ల సరఫరా అధ్వాన్నంగా వుందని, కొన్నిచోట్ల అతిగా వున్నదని వ్రాశాము, ఈవారం వివిధ ప్రదేశాలనుండి మా విలేఖరులు, ఇతరులు వ్రాసిన కథనాలు సంక్షిప్తంగా ఇస్తున్నాము. ఇవి చదివినా గతవారం మేము వ్రాసింది అతిశయోక్తి కాదని ఏస్తుంది, లో ఓల్టేజి, హై ఓల్టేజి స్థాయికంగా ఏర్పడుతువున్న లోపాలో, లేక సాధారణ పరిస్థితో తెలియదుకాని, రెంటి వల్ల వినియోగదార్లు నష్ట పోతున్నది మాత్రం వాస్తవం.

మరొక యథార్థమైన విషయం ఏమిటంటే, జిల్లాలో దక్షిణపు భాగానికంటే, ఉత్తరపు తాలూకాలలో పరిస్థితి బాగున్నట్లులేదు. మరీ బుచ్చిరెడ్డిపాలెంప్రాంతీయులు లబోదిబో మంటున్నారు. అక్కడమాత్రం సరఫరా అంత దుస్థితిలో ఎందుకుందో తెలియదు. నెల్లూరులోకాని: పల్లెల్లోకాని సరఫరా నిలకడగా వుండడంలేదు; ఈ క్షణంలో వుంటే మరుక్షణంలో వుంటుందనే నమ్మకంలేదు! మోటార్లు పెట్టుకున్న రైతాంగానికి ఇది బాధాకరమైన విషయం.

జిల్లావ్యాప్తంగా సర్వత్రా వినబడుతున్న మరొక ఫిర్యాదు హెల్పర్లకొరత; వున్నవారి నిర్లక్ష్యవైఖరి. విస్తరణ మాంద్యం, మెటీరియల్‌కొరత, అదనపు సరఫరా లోపంకాని, సిబ్బంది నిర్లక్ష్యంకాని, మరొకటికాని ప్రజలనుండి ఆందోళన అలజడివస్తే విద్యుత్‌శాఖ వున్నతాధికారులు విచారించి, అలజడిలో వాస్తవం వుంటే ఏదైనా చర్యతీసుకోగలిగితే బాగుంటుందికాని, వారికి ఇటువంటివి సర్వసాధారణమై, పరిపాటైపోయినట్లున్నారు అంటే ఇటువంటి ఫిర్యాదులు. ఆందోళనకు వారికి చలి తీరిపోయిందన్న మాట!

మాకు వివిధప్రదేశాలనుండి అందిన వార్తలు దిగువ ఇస్తున్నాము!

> **నెల్లూరు నయం!**
>
> నెల్లూరులో విద్యుత్ సరఫరా సరిగాలేదు; క్షణంపోక, క్షణం రాకగావుంది అని ఒకరుచెప్తుంటే మాజీమంత్రి శ్రీ జనార్దనరెడ్డి అన్నారు - "నెల్లూరు ఎంతో నయం హైదరాబాదులో మరీ అధ్వాన్నంగావుంది". అది రాజధాని నగరంగదా!

### గూడూరు ప్రాంతం

లో ఓల్టేజివల్ల మోటార్లు దెబ్బతింటున్నాయని, సరఫరా నిల్చిపోవడంవల్ల పైర్లకు సకాలంలో నీళ్ళు అందక నష్టపోతున్నామని రైతులు ఫిర్యాదు చేస్తున్నారు. హెల్పర్లకు ఏమి చెప్పుకున్నా దిక్కులేకుండావుందనికూడా వాపోతున్నారు. పాత దరఖాస్తులు త్రొక్కిపట్టి, కొత్త అప్లికేషన్లకు ముందు సరఫరా యిస్తున్నారని రైతుల ఆరోపణ. మొత్తానికి సరఫరా విషయంలో, విద్యుత్‌శాఖ సిబ్బంది విషయంలో వినియోగదార్లలో, ముఖ్యంగా రైతులలో తీవ్రమైన అసంతృప్తి కనబడుతోంది!

విద్యుత్‌శాఖాధికార్లను అడిగితే లో ఓల్టేజికి, సరఫరాలేకపోవడానికి ప్రజల్లో కొందరి దుర్వినియోగం కారణమంటారు,

—కొరవ 6వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు
విమర్శకుడు

## నలుగురు చస్తే దిక్కు లేదా?

ఆత్మకూరు సమీపంలో మే 28 తేది ఒక బావిలోదిగి విషవాయువువల్ల శిరిపాలు నాయుడు (20), చల్లా కృష్ణారెడ్డి (42) చల్లా చినరామరెడ్డి (45), చల్లా హనుమారెడ్డి (20) దుర్మరణం పాలైన విషయం పాఠకులకు తెలిసిందే. వీరిలో మొకటివ్యక్తి అవివాహితుడు, రెండవ యువకునికి ఆరునెలల క్రితం వివాహమైంది; తక్కిన ఇద్దరు భార్య, పిల్లలు, తల్లిదండ్రులు వున్నవారు. ఒక దినకూలి చనిపోయి ఒకరుదిగి నలుగురూ మృత్యువాతకి ప్రాణాలు పోగొట్టుకున్న సంఘటన ఇది.

వీరి దుర్మరణానంతరం గ్రామస్తులు ఒక కోడిని బావిలో దించితే అది కొట్టుకొని చచ్చిందట. ఫైర్ సర్వీస్‌వారు వెలిగించిన లాంతరును దింపితే అది ఆరిపోయిందట; దాంతో వారి మరణం విష వాయువువల్ల అయివుంటుందని అనుకున్నారు. ఆ బావిలో ఇప్పటికీ బుడగలొస్తున్నాయని చెప్తున్నారు.

ఒక్కసారి నాలుగు నిండుప్రాణాలు పోతే, ఆ ప్రమాదం దేనివల్ల అని విచారించే దిక్కు లేకపోవటం విచారకరం. ఎం.ఎల్.ఏ. డాక్టర్ సుందరరామరెడ్డి ఈవిషయంలో కలెక్టరుగారిని కలుసుకున్నారట; ఓ.ఎన్.జి.సి. వాళ్ళకు వ్రాసి నాలుగు ప్రాణాలు తీసిన ఆ బావిలోని గ్యాస్ వ్యవహారాన్ని పరిశీలింపచేయవలసిందిగా కోరారట. కాని పదిహేను రోజులైనా ఇంతవరకు అతీగతిలేదు. ప్రక్కనున్న ఇతరబావుల్లోకూడా ఇటువంటి విషవాయువు వుంటుందేమోనని ప్రజలు భయపడుతున్నారట. కలెక్టరుగారు మృతులకుటుంబాలకు సహాయం చేయకపోయినా, ఓ.ఎన్.జి.సి.వారిని వెంటనే రప్పించి, ఆబావి, చుట్టుప్రక్కల బావులలోని వాయువును పరీక్షచేయించడం, ఈ విషయానికి ప్రత్యేక ప్రాధాన్యత ఇవ్వడం అవసరం.

## అసిస్టెంట్లు ఏరి?

తాలూకాలతోబాటు రెవిన్యూ ఇన్స్పెక్టర్లు, విలేజి అసిస్టెంట్లుకూడా పోయారట; వారి నియామకం కొత్తగా జరగాలట. అది ఎప్పుడు జరుగుతుందో ఏమో? ప్రజలు బుద్ధిమంతులు కాబట్టి పరిపాలన సక్రమంగా నడుస్తున్నది గాని, లేకుంటే పల్లెలు అరాజకంపాలై వుండవలసిందే గదా!

విలేజి అసిస్టెంట్లను నియమించేటప్పుడు, వారికి నిర్ణయించబడిన కేంద్రంలో కాపురం వుండేటట్లు, ఆయా గ్రామాలకు నిర్ణీత రోజుల్లో వచ్చేటట్లు ఏర్పాటు చేయడం అవసరం.

## సాయిబాబా మందిరం

సాయిబాబా మందిరం పాలకవర్గానికి 9 తేది ఎన్నికలట, హోరాహోరీగా వున్నట్లుంది పోరాటం.

వృత్తి విభూది అయితే ఆ దాయంకు ఎవ్వరూ రారు; విభూతి, ఆదాయము ఎప్పుడు ఏర్పడుతాయో అప్పుడు ప్రతి ఒక్కరిలో భక్తి ప్రకోపిస్తుంది. మొన్నటి వరకు రాజరాజేశ్వరి ఆలయం రచ్చకెక్కింది; పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చింది. ఇప్పుడు సాయిబాబా మందిరం బజారుకెక్కింది. చివరకు ఇదేమవుతుందో తెలియదు. కాని ఒక సలహా: పోటీలు మానండి; ఒకచోట కూర్చొని కలిసిసుకోండి; సఖ్యత అవగాహనకు రండి; సామరస్యంగా పరిష్కరించుకోండి; సాయిబాబామీద ఏమాత్రం భక్తి వున్నా బజారుకెక్కకండి.

## రాస్తా రోకో

రైతులకు సంబంధించిన విద్యుచ్ఛక్తి సమస్యలను పరిష్కరించడంలో రాష్ట్ర ప్రభుత్వం ఉదాసీనతకు నిరసనగా 7 తేది ఉదయం నెల్లూరుటౌన్‌లో భారతీయ యువమోర్చా కార్యకర్తలు 'రాస్తా రోకో' ఉద్యమం నిర్వహించారు.

వెంకటేశ్వరపురం, పెన్నా బ్రిడ్జి, సనాబుపేట తదితర ప్రాంతాలలో ఆ సంస్థ కార్యకర్తలు రోడ్డుకు అడ్డం కూర్చొని ట్రాఫిక్ బంద్ చేశారు. అయితే కార్యకర్తల సంఖ్యకంటే, ప్రతిదగ్గరా పోలీసులసంఖ్యే ఎక్కువగా కన్పించింది. వారు కార్యకర్తలను ఎప్పటికప్పుడు అరెస్టుచేసి, తర్వాత విడుదలచేశారు.

## సి. ఐ. దౌర్జన్యం

టౌన్ సి.ఐ. మురళి రెండవ టౌన్‌కు చెందిన ఒక కానిస్టేబుల్‌పై ఇటీవల అకారణంగా చేయిచేసుకున్నారట. దానిని పోలీసు ఉద్యోగుల సంఘం తీవ్రంగా పరిగణించి, ఆందోళన తలపెట్టిందట. ఎస్.పి. గారు జోక్యం చేసుకుని- దర్యాప్తుకు ఆదేశించి, వారిని శాంతింపజేశారు.

## అధికారవర్గం

వ్యవసాయశాఖ డిప్యూటీడైరెక్టరు శ్రీ ఎస్. వాసుదేవరెడ్డి 3 తేది మళ్ళీ ఛార్జి తీసుకున్నారట, ఏప్రెల్ 16 తేది నుండి సెలవులో వుండినారు.

స్వంతపనిమీద పెట్టిన సెలవుకాదని, నిర్బంధపు సెలవని అంటారు. నిర్బంధం ఎందువల్లనంటారా?- అయిపోయినదానిని తిరగదోడడమెందుకులెండి!

## డాక్టర్ రఘురామరెడ్డి

వ్యక్తిగా ఎంత సౌజన్య మూర్తి. డాక్టరుగా సేవాతత్పరుడైన కంటి డాక్టరు పి. రఘురామరెడ్డిగారు నాలుగేళ్ళు ఇరాన్‌లో గడిపి 30 తేది నెల్లూరు విచ్చేశారు; ఈ నెల 12 తేది నుండి వి.ఆర్. కాలేజీ ఎదురుగా తన స్వగృహంలో ప్రాక్టీస్ ప్రారంభించబోతున్నారు. వారికి మా శుభాకాంక్షలు.

## ఆస్పత్రి సూపరింటెండెంటు

పెద్దాస్పత్రి సూపరింటెండెంటుగా వుండిన డాక్టర్ ఎం.వి. రమణరావు శ్రీకాకుళం బదిలీ అయ్యారు; వారి స్థానములో ఇక్కడే పనిచేస్తూండిన డాక్టర్ ఎం. యాదగిరినాయుడుగారు నియమితులై 1 తేది చార్జి తీసుకున్నారు.

నాయుడుగారు అనుభవజ్ఞులైన డాక్టరు; సమర్థులైన సర్జను. పెద్దాసుపత్రిని పేదలు, అనాధలైన రోగులకు ప్రేమాదరాలు లభించే ఆశ్రమంగా తీర్చిదిద్ది, నూతనాధ్యాయాన్ని ప్రారంభించాలని మా కోర్కె. నాయుడుగారికి మా హృదయపూర్వక అభినందనలు.

## పత్రికల వార్షికోత్సవాలు

లాయర్ వారపత్రిక నాలుగవ జన్మదినోత్సవం 6 తేది టౌన్‌హాల్‌లో ఆడంబరంగా జరిగింది. ఎమ్మెల్యే శ్రీ కె.వి. సుబ్బారెడ్డి అధ్యక్షత; ఎం.పి. శ్రీ బెజవాడపాపిరెడ్డి, వెటర్న్ శ్రీ టి.వి. రావు, జర్నలిస్టు శ్రీ ఎ.బి.వి. నరసింహారావు, లెక్చరర్ టి.వి. సుబ్బారావు తదితరులు మాట్లాడారు. రెవిన్యూ మంత్రి శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి ఆత్మకూరు పాత్రికేయుడు సుబ్బారెడ్డిని 'లాయర్' అవార్డుతో సత్కరించారు. సంపాదకుడు శ్రీ తుంగా రాజగోపాలరెడ్డి స్వాగతవచనాలు చెప్పారు.

○○○

అపరాజిత పక్షపత్రిక తొలి జన్మదినోత్సవం 2 తేది మహిళా గ్రంథాలయంలో జరిగింది. డి.పి.ఆర్.ఓ. శ్రీ వెంకటరత్నం అధ్యక్షించారు. ఎమ్మెల్యే శ్రీ కె.వి. సుబ్బారెడ్డి, వాణిజ్యపన్నుల డిప్యూటీ కమిషనర్ శ్రీ అమ్ములయ్య, సింహపురి నెల్లూరు కాలింగ్ సంపాదకులు శ్రీ ఆకుల సుబ్రహ్మణ్యం, శ్రీ ఖలీలుద్దీన్ అహమ్మద్ తదితరులు మాట్లాడారు. సంపాదకుడు శ్రీ సర్వేపల్లి రామమూర్తి స్వాగతం చెప్పారు. సభలో సంగం డాక్టరు శ్రీ బి.వి. కృష్ణారెడ్డిని సన్మానించారు.

○○○

కావలి పక్షపత్రిక [illegible] 19వ వార్షికోత్సవం ఇటీవల జరిగింది. డిపిఆర్ఓ శ్రీ వెంకటరత్నం అధ్యక్షత వహించారు. తాసిల్దారు శ్రీ పార్థసారథి, శ్రీ డి. కోదండరాం, డిపిఆర్ఓ శ్రీ ఎం. రామమూర్తి, జర్నలిస్టులు శ్రీ కేసరి సుందరరామశర్మ, రామమోహనరావు, తదితరులు మాట్లాడారు. ఇండియన్ ఎక్స్‌ప్రెస్ విలేఖరి శ్రీ ఎ.బి.వి. నరసింహారావును సత్కరించారు. సంపాదకుడు శ్రీ శివరాం స్వాగత వచనాలు పలికారు.

## మరణం

అడిషనల్ పబ్లిక్ ప్రాసిక్యూటరు శ్రీ ఇ. విష్ణుశర్మ (54) 6 తేది హైదరాబాదులో అకాలమరణానికి గురియైనారు. ఆయనకు భార్య, ఒకకుమారుడు, ఇద్దరు కుమార్తెలు వున్నారు.

## నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 9.6 అ. |
| సర్వేపల్లి ,, | 1.5 అ. |
| నెల్లూరు చెరువు | 10.0 అ. |

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | పుట్టి | 1350.00 |
| 2608 | | 1270.00 |
| ఐ. ఆర్. 20 | ,, | 1300.00 |

# జిల్లావార్తలు

## కావలి మున్సిపాలిటీకి దినదినగండం

ఎన్.టి. రామారావుగారి పాలనలో ఏ ఒక్కటైన ఏ సంస్థ పాలకవర్గంగూడా సవ్యంగా పాలనను సాగించగల్గేట్లు లేదు. నెల్లూరు మున్సిపాలిటీ రద్దయి ఇంతవరకు అక్కడ ఎన్నికలు జరుపలేదు; ఇప్పుడు తెలుగుదేశం కావలి మున్సిపాలిటీకి ఎసరుపెట్టి రద్దుచేయడానికి రంగం సిద్ధం చేస్తున్నారట.

గూడూరు ఎమ్మెల్యే శ్రీ దుర్గాప్రసాద్‌రావు, తన 'రాజ్యపరిధి' దాటి కావలి విషయంలో తలదూర్చటం బాగులేదనుకున్నారేమో, ఇటీవల జరిగిన కావలి మున్సిపాలిటీ సమావేశానికి హాజరై, మున్సిపల్ కౌన్సిల్ రద్దుచేయించి తీరతానని ఉత్తరకుమార ప్రతిజ్ఞ చేశారట.

దానికి తగినట్లే, కమీషనరుకూడా ఛైర్మన్‌పై ఒక అవినీతి ఆరోపణచేస్తూ, ప్రభుత్వానికి ఫిర్యాదు పంపారట. దానితో ఆ కౌన్సిల్ సమావేశంలోకూడా తప్పు జరిగింది.

ఇదివరకు మున్సిపాలిటీపై ఏ.సి.బి. దాడి జరిగిందని ఒక పుకారు పుట్టింది. అది వట్టి పుకారేనని తేలినప్పటికీ, స్థానిక జిల్లా తెలుగుదేశం నాయకులలో ఒక వర్గం 'కక్ష' కై గట్టిప్రయత్నమే చేస్తున్నదట. కావలి అసెంబ్లీ ఎన్నికలో ఓటమి వారి ఆక్రోశానికి కారణమని తెలుస్తున్నది.

## ఆత్మకూరుకు 11 బోర్లు ఏమూలలకు?

ఆత్మకూరు పంచాయతీసమితిలో మంచినీటికోసం ప్రభుత్వం 11 బోర్లు మంజూరు చేసిందట జిల్లా అధికార్లు. సమితిలోని మొత్తం 88 గ్రామాల్లో అప్పాతికభాగం పీటిఎద్దడితో కటకట లాడిపోతున్నాయి. వీటిలో 11 బోర్లు ఏ ఊరికి ఇస్తారు? ఎవర్ని సంతృప్తి పరుస్తారు? ఎమ్మెల్యేగారు కలెక్టరును అడిగితే, తాను విన్నపోయుగాలిసని అన్నారట ఆమె.

## ప్రేమ వివాహం

ప్రేమంను పెళ్లిళ్లగా పరిణమింపజేసుకోవడంలో నెల్లూరుజిల్లా యువతీ యువకులు తరచు సఫలీకృతమౌతున్నారు. మొన్న 30 తేది కావలిలోకూడా ఒక ప్రేమపెళ్లి జరిగింది. పైగా కులాంతర వివాహం!

వరుడు నందనవనం మధుసూదనరావు(28) బ్రాహ్మణుడు, వధువు గ్రంధి మాధురి వైశ్య యువతి. ఇద్దరికీ తల్లిదండ్రుల ఆమోదం లభించలేదట; స్నేహితులే పెళ్లి పెద్దలై ఆశీర్వదించి, అక్షింతలు చల్లారు. అబ్బాయి కావలిలోని ఒక ప్రైవేటు స్కూలు టీచరు; అమ్మాయి ఇంటర్ చదువుతూందట.

ఇంకా ఘోరమేమిటంటే, ఇచ్చిన 11 బోర్లు వేయడానికి నిధులు లేవట. మంజూరుకాగితం చేతపట్టుకుని కూర్చుని వున్నారుఅధికార్లు అన్నగారిరాజ్యంలో ఆశ్రమాలకుతప్ప మంచినీళ్ళకుకూడా డబ్బులున్నట్లులేదు;

## ఎందుకీ వ్యర్థ విద్యుత్ సంస్థ

ఆత్మకూరులో గ్రామీణ విద్యుత్ సహకారసంఘమునేర్పరిచారు. కేంద్రప్రభుత్వం ఆర్థికసహాయంతో నడిచే సంస్థయిది. లెక్కప్రకారం ఇందులో రైతులు సభ్యులుగా వుండాలి; వారే డైరెక్టర్లుకావాలి. కానీ ప్రస్తుతం సంస్థను అధికారులంతో నింపివేశారు. ఒక్క రైతుకూ ప్రాతినిధ్యంలేదు.

పైగా ఏ రైతుకు మోటారుకావాలన్నా 3 వేలపైగా ఖర్చవుతుందట బోర్డు నిర్వహణలోకూడా ఇంత వ్యయం కాదట. దానికితోడు, ప్రతిమోటారుదరఖాస్తును కలెక్టరుగారు స్వయంగా పరిశీలించనిదే మంజూరుచేయడంలేదట దీనివల్ల దరఖాస్తుచేసి, నెలలవర్యంతం వేచి చూడవలసి వస్తున్నదట. రైతులు లబోదిబోమంటున్నారు.

రైతులకు కరెంటు సరఫరాలో సౌకర్యం కల్పించేనిమిత్తం స్థాపించిన సంస్థ ఇది; అదే ఇప్పుడు మామూలు కంటే కష్టాలు కొనితెచ్చిపెట్టోందని రైతులగోల. అధికారులు సంస్థను ప్రయోజనవంతంగా నడపలేనప్పుడు, రైతులకు ఈ కొత్తతలనొప్పి ఎందుకు? ఈ సంస్థే రద్దుచేసిపారేస్తేపోలేదా?

## విరువూరు స్కూలు వివాదం: కలెక్టరు తీర్పు

ఉదయగిరి సమితికిచెందిన విరువూరు అప్పర్ ప్రైమరీ స్కూలుకు లక్ష 40 వేలతో భవనం కట్టడానికి నిధులు మంజూరైనాయట. అయితే, ఈభవనాలు తమగ్రామంలోనే కట్టాలని, పొరుగున వున్న కృష్ణంరాజుపల్లె గ్రామస్తులు పట్టుబట్టి, తమపక్షంగా 4 ఎకరాల స్థలం కూడా కొనిఇచ్చారట. ఇది రెండు గ్రామాలకు, తాలూకాలోని రెండు రాజకీయవర్గాలకు పట్టుదల సమస్యగా పరిణమించి హైకోర్టువరకు పోయారట.

అయితే, అలస్యంగానే అయినప్పటికీ, కలెక్టరుగారు జోక్యంచేసుకొని, ఇరుపక్షాలతో సంప్రతించి విరువూరులోనే భవనాలు కట్టాలనితీర్పుచెప్పారట. ఇప్పుడు పనిజరుగుతూంది. సమస్యను నేర్పుగా పరిష్కరించిన కలెక్టరు కుమారి సుజాతారావుగారికి గ్రామస్తులు సమితి అధ్యక్షుడు శ్రీ ఎం. వి. నారాయణరెడ్డి కృతజ్ఞతలు చెప్తున్నారు.

## మద్యపానమే మృత్యుపాశమైంది!

కావలికి చెందిన వానివల్లి నారాయణరెడ్డి (40) అనే కంట్రాక్టరు 28 తేది రాత్రి, త్రాగుడు మత్తులో చాలా దారుణమైన మరణానికి గురైనాడు.

రాత్రి పొద్దుపోయిన తర్వాత బాగా మందు పట్టించి రిక్షాలో ఇంటికి బయలుదేరాడట. దారిలో కలుగోళమ్మ దేవాలయం దగ్గర గేటు వేసివుండడంతో, దిగి, రైలుకట్ట దాటబోయాడట. రిక్షావాలా వారించినా, విప్పించుకోలేదట; ఈ లోగా జిటి ఎక్స్‌ప్రెస్ వేగంగావచ్చి గుద్దింది; ఆ ప్రమాదంలో తల, ఇంజనులో ఇరుక్కొనిపోయిందట, డ్రైవరు గమనించకపోవడం వలన శవం, తెట్టువరకు రైలుతో టీ ఈడ్చుబడిందట అక్కడ రైలాపి, రైలునుంచి శవాన్ని వేరుచేశారట, పాపం ఘోరమైన చావు,

నారాయణరెడ్డికి భార్య, కుమారుడు వున్నారట. పైగా ఇప్పుడామె గర్భవతి కూడానట. త్రాగుడు ఎంతపనిచేసిందో చూడండి!

— —









## • ఉత్తరక్రియలు •

యువకుడు, ఉత్సాహవంతుడు

### చల్లా కృష్ణారెడ్డి

ఇంకా ఎంతో అభివృద్ధి చెందవలసిన కాలంలో అకస్మాత్తుగా 26-5-85 తేది ఆదివారం మృత్యువాతబడినాడు వారి ఆత్మకు దైవసాన్నిధ్యంలో చిరశాంతి కలగాలని ప్రార్థిస్తూ వారి ఉత్తరక్రియలు 13-6-85 తేది గురువారం ఆత్మకూరులో మా స్వగృహమున జరుగును.

| | | | |
|---|---|---|---|
| భార్య : రాజమ్మ | | తండ్రి : | చల్లా వెంకురెడ్డి |
| కుమారులు : మోహన్, రవి | | తల్లి : | రమణమ్మ |
| కుమార్తె : అనూరాధ | | తమ్ముళ్ళు : | శంకరరెడ్డి |
| చెల్లెళ్ళు : సరోజనమ్మ | | | నారాయణరెడ్డి |
| విజయలక్ష్మి | | | జనార్దనరెడ్డి |
| బావలు : గుండాల మునిరెడ్డి(బస్ ఓనర్). పి రాఘవరెడ్డి | | | |

# విద్యుత్ సరఫరా

(5 వ పేజీ తరువాత)

ట్రాన్స్ ఫార్మర్ తో ఫ్యూజ్ పోతే రైతులే ఏదో ఒకతీగతో వేసుకుంటారట అందువల్ల ట్రాన్స్‌ఫార్మర్లు కాలిపోతున్నాయట. ప్రయారిటీలంవల్ల పాత దరఖాస్తులు ప్రక్కనపెట్టి, కొత్త వాటికి సరఫరా ఇవ్వవలసి వస్తున్నదట. ఇదీ వారి సంజాయిషీ.

—మా వ్య.వి.

హెల్పర్లు లేరు!

కోట, వాకాడు ప్రాంతంలో గత మాసంలో ఇకపై రోజులపాటు రోజుకు రెండుగంటలపాటు సరఫరా అపాలికారు: తర్వాత బాగుంది. ఇక్కడ వోల్టేజి సమస్యకూడా అంతగా లేదు. కాని అనేక గ్రామాల్లో హెల్పర్లులేక; ఫీజు పోయినా వేసేదిక్కు లేదు.

—టి. వెంకటకృష్ణారెడ్డి బి.ఎ.

ఆత్మకూరు తాలూకాలో
రాకపోకలు ఎక్కువట!

ఆత్మకూరు తాలూకాలో సరఫరా ఎన్నిసార్లు పోతుందో ఎన్నిసార్లు వస్తుందో చెప్పలేము. ఈ అస్థిర పరిస్థితి వల్ల రాత్రిపూట కిరసనాయిల్ దీపాలే గతి అయ్యాయి. కాని పత్తి, వేరుశెనగ సాగుచేసివున్న రైతులు ఇబ్బందిపడిపోతున్నారు; నష్టానికి గురియవుతున్నారు.

తాలూకాలో విద్యుత్ సరఫరా పరిస్థితి గూర్చి కొందరు ముఖ్యులను కలసుకొని తెలిసికొన్న విషయాలివి. డాక్టరు కొండారెడ్డి అంటారు—"అప్పత్రిలో కరెంటువున్నా లేకున్నా ఎట్లనోతంటాలు పడుతున్నాం. కాని ప్రతి ఐదునిమిషాలకు సరఫరా పోతూ సైర్లు దెబ్బతింటున్నాయి. కరెంటును నమ్ముకొని ఎందుకు సాగుచేశానా అని ఇప్పుడు విచారిస్తున్నాను" అన్నాడాయన. అడ్వొకేటు శ్రీ మహదేవరెడ్డి, మా స్వగ్రామం గొలవరంలో (కావలి తాలూకా) కూడా పరిస్థితి ఇంతే అన్నారు. రాజవోలు రైతు శ్రీ మంతు చంద్రారెడ్డి తన అవస్థ ఏకరువు పెట్టాడు—మోటారేసి నీళ్ళు కాల్వ చివరకు పోయేసరికి సప్లయ్ టప్‌మని పోతుందట; మళ్ళీ రావడం, పేయడం... ఈ కొలువుతో సరిపోతున్నది అన్నాడాయన. దూబగుంటలో మోటార్లు బూమిమీద పెట్టుకుంటే నీళ్ళు లాగలేవు; బావుల్లో లోతుగా అమర్చుకోవాలి. కరెంటు రావడం పోవడం వల్ల బావిలోకి ఎక్కిదిగలేక రైతుల దుంప తెగిపోతున్నదట! ఈ విషయం శ్రీ యర్ల బాలిరెడ్డి ఎంతో బాధతో వివరించాడు. అర్ధరాత్రిలో సప్లయ్ బాగా వుంటుందని, తక్కువవప్పుడు రైస్‌మిల్లు కూడా నడిపేయదని గుర్లపేరు రైతు ఒకరు చెప్పారు.

ఆత్మకూరు తాలూకాలో విద్యుత్ సరఫరా పరిస్థితి ఇదీ.

—మా అ.వి.

ఉదయగిరిలో
పేరుకు క్లస్టర్ స్కీము!

ఉదయగిరి తాలూకాలో 90 రెవిన్యూ గ్రామాలు, 40 మజరాలు వున్నాయి. పేరుకు క్లస్టర్ స్కీము అమలులో వున్నదనేగాని, ఇంకా 60 గ్రామాలు విద్యుచ్ఛక్తికి నోచుకోలేదు, అధికార్ల నివేదికల్లో మాత్రం ఉదయగిరి తాలూకా అంతా ధగద్ధగాయమానంగా ప్రకాశించిపోతున్నదని లెక్క! ఉన్నగ్రామాలలోనైనా సరఫరా పోతే రెండుమూడు రోజులకూడా రాదు. అదేమని అడిగితే మెటీరియల్ కొరత అంటారు. ఉదయగిరిలో ఒకేఒక ట్రాన్స్‌ఫార్మర్ వుంది! దానివల్ల సరఫరా ఒక గంటకూడా వుండడం లేదు. నగినేనిగుంట, సీతారాంపురం ఫిర్కాలు ఇంకా వెలుగే చూడలేదు.

—ఎం.వి. నారాయణరెడ్డి

మైనింగు ప్రాంతం

మైకామైనింగ్ ప్రాంతంలో మే 14 తేది నుండి మధ్యాహ్నం 2 నుండి సాయంత్రం 5 వరకు సరఫరా నిలుపుతున్నారు. తక్కిన సమయాల్లో విరామటంగా వుంటున్నది.

—ఎన్. మహబూబ్‌బాషా

—

## ఖాళీ స్థలము విక్రయించబడును

నెల్లూరు స్టోన్‌హౌస్‌పేటలోని జేమ్సుగార్డెన్ మెయిన్‌రోడ్డుకు ఆనుకొని ముఖోగల సుమారు 62 అంకణముల ఖాళీస్థలం, ఇది స్టోన్‌హౌస్ పేట శ్రీ విద్యానంద సరస్వతి స్వాములవారి వేదసంస్కృత పాఠశాలవారికి ఖాళీ స్థలము. హద్దులు: తూర్పు అలవల రాఘవయ్య ఇల్లు. దక్షిణం నిడవలూరు దాసీదు ఇల్లు. పడమర కొటపూరి చిన్నప్ప ఇల్లు. ఉత్తరం రోడ్డు, National High Way కు చాలా దగ్గరగాయున్నది. బావికూడా వున్నది. కావలసినవారు వెంటనే నన్ను సంప్రదించవలసినదిగా కోరుచున్నాము.

ఇట్లు,
యడ్లపల్లి గోవిందుశెట్టి
అధ్యక్షుడు.

24-5-85 తేది

## శ్రీ పెనుశిల నరసింహస్వామి దేవస్థానము

పెంచలకోన రాపూరు తాలూకా, నెల్లూరు జిల్లా

### బహిరంగ వేలము ప్రకటన

నెల్లూరుజిల్లా, రాపూరు తాలూకా, పెంచలకోన గ్రామములో వేంచేసియుండు శ్రీ పెనుశిల నరసింహస్వామివారి దేవస్థానము ఈ క్రింది కనుపరచిన హక్కులను 20-6-85 తేది మధ్యాహ్నము 2 గంటలకు నరకు దేవస్థానము కార్యాలయమువద్ద దేవాదాయశాఖ అధికారుల సమక్షములో బహిరంగవేలం వేయబడును.

వివరములు

1. కొబ్బరికాయలు అంగడి అమ్ముకొను హక్కు 1-7-85 నుండి 15-4-86 వరకు యుండును. ప్రథమధరావత్తు రు. 1000/- చెల్లించి పాటలో పాల్గొనవలయును.
2. మూడు ఆలయములలో కొబ్బరి చిప్పలు వసూలుచేసుకొను హక్కు 1-7-85 నుండి 15-4-86 వరకు యుండును. ప్రథమ ధరావత్తు రు. 1000/- చెల్లించి పాటలో పాల్గొనవలయును.
3. ప్రసాదములు (లడ్డు, వడ, పులిహోర) విక్రయించుకొను హక్కు 1-7-85 నుండి 15-4-86 వరకు యుండును. ప్రథమ ధరావత్తు రు. 1000/- చెల్లించి పాటలో పాల్గొనవలయును.
4. తలనీలాలు వసూలుచేసుకొను హక్కు 1-7-85 నుండి 15-4-86 వరకు యుండును. ప్రథమ ధరావత్తు రు. 1000/- చెల్లించి పాటలో పాల్గొనవలయును.

సదరు వేలములో హెచ్చు పాటదారులు వేలంపాట అయిన వెంటనే ప్రథమ ధరావత్తు కాకుండా హెచ్చుపాట మొత్తములో 1/3 వ వంతు పైకం చెల్లించి ఖరీదుపొందవలయును. మిగిలిన షరతులు వేలంపాట సమయంలో తెలియపరచబడును.

పెంచలకోన
5-6-85.

యజమానం శ్రీరామమూర్తి
కార్యనిర్వహణాధికారి

## జయంతి సభ

(12 పేజీ తరువాత)

పెరిగింది. దీనిఫలితంగా సంపాదకుల విలువ తరిగిపోయింది. అందువల్లే రామానాయుడు గారివలె సమ్యక్ దృష్టి, వ్యక్తిత్వంగలిగిన సంపాదకులు ఇప్పుడు కరువైపోతున్నారు" అన్నారు శ్రీ సీతారాం.

జాతీయస్థాయి పత్రికలు కేవలం కొందరు ప్రముఖులకు కొన్నినగరాలకు మాత్రమేపరిమితమైపోతున్నాయని, లక్షలాదిగా వున్న గ్రామాల వార్తలను ఈ పత్రికలు అలక్ష్యపెడుతున్నాయని అంటూ, జమీన్‌రైతు వంటి పత్రికలు ప్రతిజిల్లాలో ఏర్పడి గ్రామాలలోని సంఘటనలను ప్రజలదృష్టికి తీసుకొనిరావాలని శ్రీ సీతారాం కోరారు.

పత్రికారంగంలో ఆధునికత పేరుతో వస్తున్న మార్పులు పత్రికల సర్క్యులేషన్ పెరగడానికి తోడ్పడుతుండటంవల్ల ఆయన సంతోషం వ్యక్తంచేశారు.

పత్రికారంగంలో సాంకేతికంగా జరుగుతున్న అభివృద్ధిని, జమీన్‌రైతు కూడా అమలు చేయాలని, టైమ్స్ ఆఫ్ ఇండియా మద్రాసు ప్రత్యేకవిలేఖరి శ్రీ వి. జి. ప్రసాదరావు కోరారు. పెద్దపెద్ద పత్రికలన్నిటికి కట్టుకొని స్థానికపత్రికలు నిలదొక్కుకోవాలంటే, సాంకేతికంగా అభివృద్ధిచెందడం తప్పనిసరి అన్నారాయన.

జర్నలిజం పరమ పవిత్రమైన వృత్తి. అయితే ఇటీవలి కాలంలో పత్రికలు పత్రికారచయితల కొరతను ఎదుర్కొంటున్నాయి, ఇది చాలా శోచనీయమైన విషయం. విదేశాలలో కాలేజిస్థాయి నుంచే విద్యార్థులచేత స్వంతంగా పత్రికలు నడిపించి, వారిలో ఆ వృత్తి పట్ల ఆసక్తి కల్గిస్తున్నారు. మన వి. ఆర్. కాలేజివంటి విద్యాసంస్థలు ఈ ప్రయోగం చేసి చూడాలి అన్నారాయన.

మొత్తంమీద సత్కారాలందరి ఉపన్యాసాలన్నీ ముక్తసరిగానే జరిగినా, విషయపూర్ణంగా వుండినాయి.

తర్వాత శ్రీ సీతారాం, శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య చేతులమీదుగా రామానాయుడు అవార్డు అందుకున్నారు. సంపాదకుడు శ్రీ శ్రీరామమూర్తి సన్మానపత్రం చదివారు.

తొలుత సభకు శ్రీరామమూర్తిగారే స్వాగతంచెప్పారు. శ్రీ బండి నాగరాజు, రామానాయుడుగారి గేయాలను చదివారు. సహాయసంపాదకుడు దోరేంద్ర ప్రసాద్ అతిథులను పరిచయంచేసి, వందనాలు చెప్పారు. కుమారి లక్ష్మి, కుమారి గిరిజ ప్రార్థనగా దేశభక్తిగీతం ఆలపించారు.

జయంతి సభలో పాల్గొన ముఖ్యుల పేర్లు వ్రాయడం సాధ్యంకాదు, బాగుగా కూడా వుండదుకాని డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి, ఎన్. జనార్దనరెడ్డి, పెళ్ళకూరు రామచంద్రారెడ్డి మున్నగువారందరూ సభకు విందుదనం చేకూర్చారు.

—

## హైదరాబాదు లేఖ

(మొదటి పేజీ తరువాత)

పోతే శ్రీ తుమ్మలచౌదరికి ఆ పదవిని కట్టబెట్టవచ్చునని తెలుస్తున్నది.

ఏది ఏమైనప్పటికి తనకు అపాతమైన ప్రజాదరణ ఉన్నందువల్ల అసమ్మతివాదులను నిర్దాక్షిణ్యంగా అణచివేయడానికి శ్రీ రామారావు నిర్ణయించుకున్నారని తెలుస్తున్నది. అసమ్మతి వాదులను ప్రజలు పట్టించుకోరని ఆయన నమ్ముతున్నారు. అందువల్లనే ఆయన ఉపేంద్రను తప్పించారని, రామోజీరావు కార్యకలాపం గురించి పట్టించుకోవడం లేదని తెలుస్తున్నది. రామోజీరావుమాత్రం రామారావు అంతు తేలుస్తానని అంటూ అయనను గద్దెదించడానికి అన్ని ప్రయత్నాలు చేస్తున్నారని అవసరమైతే పెద్దసంఖ్యలో తెలుగుదేశం ఎం ఎల్ ఎ లను పార్టీనుంచి బయటికి తప్పించి దెబ్బతీయడానికి చూస్తున్నారని రాజకీయ వర్గాల్లో చెప్పుకొంటున్నారు.

—

## పంచాంగం

మృగశిరకార్తె

21-6-85 వ తేది శుక్రవారం రాత్రి 12-06 గంటల వరకు మృగశిర కార్తె వుండును.

జూన్ తిథులు

8 శని షష్ఠి రా 2-45 గం. వ.
9 ఆది సప్తమి రా 3-21 గం. వ.
10 సోమ అష్టమి తె 4-21 గం. వ.
11 మంగళ నవమి పూర్తి
12 బుధ నవమి ఉ 6-03 గం. వ.
13 గురు దశమి ఉ 7-47 గం. వ.
14 శుక్ర ఏకాదశి ప 9-45 గం. వ.

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి.

## ఇల్లు అమ్మబడును

నెల్లూరు దర్గామిట్ట, జర్నలిస్ట్ కాలనీలోని MIG No. 6 ఆధునాతనమయిన యిల్లు అమ్మకమునకు వున్నది. ఖాళీ పొసెషన్ యివ్వబడును.

66 అంకణముల స్థలములో సుమారు 2400 చదరపు అడుగుల కట్టుబడితో గ్రౌండ్‌ఫ్లోరు నందు మొత్తం రెండు బెడ్‌రూంలు (అటాచ్డ్ బాత్‌రూంలు), ఒక డైనింగ్ హాలు, వంటగది, పూజగది, లివింగ్ రూం, మెట్లగది, ఒక ఫ్రంట్ సిట్ ఔట్, ఆహ్లాదకరమయిన లాన గేరేజ్ పోర్టికో. పై అంతస్తులో ఒక బెడ్‌రూం, ఒక చిన్న బెడ్‌రూం అటాచ్డ్ బాత్‌రూంతో, హాలు, సిట్ అవుట్ కలదు. బావి, ఓవర్‌హెడ్ టాంకు, మునిసిపల్ కొళాయి గలవు.

వివరములకు : సి. యల్. కిషోర్‌కుమార్
16/115-12 వెంకట్రామాపురం, నెల్లూరు.
ఫోన్ : 3407, 3954

## నెల్లూరు Ist అడిషనల్ డిస్ట్రిక్టు మునసబ్ కోర్టులో

E. P. No. 1/83 S. C. S. No. 8/82

Canara bank, Nellore represented by its Manager
—వాది/D. H. R:

1. కాటివత్తి కృష్ణయ్య వగైరాలు —ప్రతివాదులు/J. D. R,

వేలం ప్రకటన

పై నెంబరులో "బి" షెడ్యూలు దాఖలా స్తిరాస్తిని పై కోర్టులో 10-6-85 తేది పగలు 11 గంటల మొదలు సాయంత్రం 5 గం. వరకు వేలము జరుపబడును.

బి. షెడ్యూలు

నెల్లూరు తాలూకా, కమువూరు, వవటపాలెం గ్రామములో 2 ప్రతివాది గారినేని ఒంగామయ్యగారికి హక్కు అనుభోగములు గల మాగాణి భూములు వివరం.

| పట్టా నెం. | సర్వే నెం. | య. సెం. | అనుభవ విస్తీర్ణం |
|---|---|---|---|
| 149 | 3A2/B1 | 2-39 లో | య. 1-39 ట్లు |
| | 7A2/B2 | 1-65 పూర్తి | య. 1-65 ట్లు |
| 147 | 563 C | 0-60 ,, | య. 0-60 ట్లు |
| | 578 C | 0-27 ,, | య. 0-27 ట్లు |
| 147 | 158 E | 1-22 ,, | య. 1-22 ట్లు |
| 482 | 168 | 1-92 లో | య. 0-78 ట్లు |
| | | | కుల్లు య. 5-91 ట్లు |

ఈ ఆస్తిమీద రు. 10000/- లు అనుమానం జాకీ లోబడి వేలం వేయించవలయును. వాదికర రు. 7000/- లు.

—సి. శేషాచలం, వాదితరపు అడ్వకేటు.

# తెలుగు పరిశ్రమలో కృష్ణ స్థానం అనితరసాధ్యం!

హీరో కృష్ణకు 43 సంవత్సరాలు నిండాయి; సినీ జీవితంలో ఇరవయ్యేళ్ళు పూర్తయ్యాయి.

1965లో లేలేతవయసులో, నూనూగు మీసాలతో, మసమిగ్గు, బిడియాలతో పరిశ్రమలోకి ప్రవేశించిన కృష్ణ, తెలుగు చలనచిత్రసీమకే వన్నె తెస్తాడని, తన సినీజీవితంలో ఇన్ని విశ్వసలే ఎక్కుతాడని ఎవరూ ఊహించలేదు; ఆశించలేదు. పరిశ్రమలో పలు చరిత్ర ప్రధానఘట్టాలకు తాను నాంది పలుకుతానని ఆయన కూడా కలగని వుండడు.

కృష్ణ నటజీవితంలోనేకాదు, నిజజీవితంలోకూడా సాహసికుడు; అనితరసాధ్యమైన విజయాలను సాధించాలన్న తపన, పట్టుదల గల్గినవాడు. అల్లూరి సీతారామరాజు చిత్రనిర్మాణం తలపెట్టినప్పుడు, కృష్ణ కొంతలోనే ఢీకొన్నాడు. సినీ భవిష్యత్తును, వ్యక్తిగత జీవితాన్ని కూడా పణంగాపెట్టి నిర్మించిన చిత్రమది. సాహసం వెనుక విజయలక్ష్మి దాగుంటుందన్న సత్యాన్ని ఆయన గ్రహించుకున్నంతగా మరెవరూ అర్థం చేసుకోలేదేమో!

నటుడుగాకంటె: సాహసికుడుగానే ఎక్కువపేరు తెచ్చుకోవడానికి అదొక కారణంకూడా. తెలుగులోకంగుచిత్రం తీయడమే ఒక దైన విషయంగా భావిస్తున్న రోజుల్లో సినిమాస్కోప్ చిత్రాలు నిర్మించాడాయన. సాంఘిక, జానపద

### జన్మదిన ప్రశంస

లకే అలవాటుపడిన తెలుగు ప్రేక్షకులకు క్రైం రుచిమరిపించిందికూడా కృష్ణే. ఆయన నిర్మించిన మొనగాళ్ళకు మొనగాడు ఇంగ్లీషులోకి డబ్ చేసి, 66 దేశాలలో ప్రదర్శించారట. తెలుగులో మరే చిత్రానికీ అంతగౌరవం లభించలేదేమో!

ఈరోజు దక్షిణాది నిర్మాతలు హిందీ రంగంలో విశేష ప్రాధాన్యత సంతరించుకోవడానికికూడా కృష్ణే కారణం. హిందీ సీమలో తెలుగువారి ప్రవేశానికి కృష్ణ అద్యులు కాకపోయినా, ప్రాధాన్యతకు ప్రేరణ ఆయనదే!

227 చిత్రాలలో నటుడుగా నటించి సాధించిన కీర్తి కంటే, మానవతా హృదయంతో సాధించిన ఖ్యాతి గొప్పది. కృష్ణ విషయంలో! ప్రజలలోని సినిమా పిచ్చిని కాసులుగా మార్చుకోవడంతోనే సరిపెట్టుకునే వ్యాపారి కాదాయన. తన ఔన్నత్యానికి కారణభూతులైన ప్రజలు ఎప్పుడు ఆపదలో పడినా, అక్కడల్లా తాను వుండటం, అండగా నిలవటం కృష్ణ లక్షణం. పరిశ్రమలో పూర్తిగా కాలూనుకోనటి తొలిదినాలలోనే ఆయన 1972లో కరువు బాధితుల సహాయం కోసం ఆంధ్రదేశమంతా తిరిగారు. జై ఆంధ్ర ఉద్యమకారులకు విరాళాలిచ్చారు; పోలీసు సంక్షేమనిధికి తోడ్పడ్డారు; దివిసీమలో ఉప్పెన బాధితులకు పెద్ద ఎత్తున సహాయంచేశారు; మొన్నటి తుఫాన్ నిధికి కూడా విరాళాలు అందచేశారు.

పరిశ్రమలోకూడా, ఎవరికి కష్టం వచ్చినా ఆదుకోవడం ఆయనకు అలవాటు. ఒక్క దాసరి నారాయణరావు మినహా ఇంతటి మానవత్వం ప్రదర్శించే ముఖ్యులు పరిశ్రమలో ఎవరూ లేరు.

రాజకీయాలలో ఆయన ప్రవేశం, వివాదాస్పదం, వ్యర్థం అయినప్పటికీ,

—కొతవ 11 వ పేజీలో

కొండను త్రవ్వి కుందేలు పట్టినట్లుంది-

# అన్వేషణ

ఎక్కడైనా మానభంగమో, హత్యో జరిగితే మన పోలీసులు అరాచయడం సంగతటుంచండి. ఎంత హంగామా చేస్తారో అందరికీ తెలిసిందే. అదే తెలుగు సినిమాల్లో పోలీసు హీరోనే అయ్యాడనుకోండి. కేసులు గీసులన్నీ టీవీ మంచంకోసుకుకట్టేసి హీరోయిన్లతో సరసాలు, క్లబ్బుల్లో డ్యాన్సులతో కాలక్షేపం చేసేస్తారు. అయన వెనుకనే విలనాలయాకు రహస్యాలన్నీ బయట పడిపోతాయి. తెలుగు చిత్రసీమ 'విచిత్ర సీమ'గా తయారవుతుందేని సరిగ్గా ఇలాంటి చోట్లే.

ఎక్కడో ఒక అడవిలో హత్యలు జరగడం. నాటి కూపీ లాగడానికి ఒక పోలీసాఫీసర్ ఆ ప్రాంతానికి రావడం, అక్కడే పక్షుల కిలకిలల్లోంచి సరికొత్త రాగాలను పలకోతిస్తున్న హేమను తన 'ఇన్వెస్టిగేషన్' కోసంగా ప్రేమించడం ఆ ప్రేమ నిజమైన ప్రేమగా మారడం వంటివి తెలుగుతెరకి కొత్తవేమీ కాదు.

అయితే ఈ పాతదనానికి మరికొంత కొత్తదనం చేర్చి ప్రేక్షకుల గుండెల్లో రైళ్ళు పరుగెట్టించాలనుకున్నారు 'అన్వేషణ' దర్శకుడు వంశీ. అందుకోసం, పనిమనిషిగా పనిచేస్తున్న పాండుచేత తన చెల్లెల్ని మానభంగం చేసిన ఫారెస్ట్ రేంజర్‌ని, అతని అనుచరుల్ని చంపి ప్రతీకారం తీర్చుకొంటాడు. తెమేది యన్‌గా కనిపించే పాండు ముసుగేసుకొని హత్యలు చెయ్యడమే ఈ చిత్రంలో విచిత్రం. ఇదే సస్పెన్స్.

అడవిలో హేమ పిట్టల కూతల్ని రికార్డు చేసుకుంటుంటే పక్షులన్నీ తామూ తెలుగుసినిమాలో నటిస్తున్నామని తెలుసుకొని దర్శకుడు చెప్పినట్లల్లా పలకడం ఈ సినిమాలో ప్రత్యేకత.

### సమీక్ష
❖
మద్దూరు శ్రీనివాసులు

ఒక పోలీసాఫీసర్‌గానుండి రహస్యాలను రహస్యాలుగా వుంచలేపోతేపోయె కేసు పూర్వాపరాలు, తాను తాజాగా కనుగొన్న విషయాలు అన్నీ మరి మరుపు కాంట్రాక్టర్ రావుగారికి చెప్పి ఆయన సలహాపైన తను నడుచుకోవడం; పోలీసాఫీసర్ తాను కర్తవ్యతెంచేపుడో తున్నాదో 'స్వగతం' ద్వారా ప్రేక్షకులకి తెలియపర్చడం వంటివి చూస్తే ఇది సస్పెన్సేకాదు నాన్సెన్సే అనిపిస్తుంది.

అనలుకథకోనే పస లేదు. ఒకపక్క పోలీసాఫీసర్‌ని అక్కడే వుంచి, అయమ్మ పకసాల్లోదించి మరోపక్క

—కొతవ 11వ పేజీలో

# తెలుగులో డ్రాకులా

ఒక దశలో ఇంగ్లీషులో డ్రాకులా చిత్రాలు పెద్ద సంచలనం సృష్టించాయి. సాధారణంగా ఇంగ్లీషు చిత్రాలలో ఏ ప్రత్యేకతకనిపించినా, అనుకరించే తెలుగు నిర్మాతలు వాటి జోలికి పోలేదు.

### సినిమావార్తలు

ఇప్పుడు తొలిసారిగా 'పున్నమిరాత్రి' చిత్రంలో డ్రాకులా పాత్ర ప్రవేశపెడుతున్నారట.

దీనికోసం అరుణాచలం అడుగున్నత్తుగలిగినఒకనటుణ్ని ఎంపికచేశారట.

రామచందర్, పవిత్ర, స్మిత తదితరులు నటించే ఈ చిత్రానికి దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి, నిర్మాత సుబ్బరాజు.

### నెప్టాపోటీలు

నెప్టా ఆధ్వర్యంలో జూలై రెండవ వారంలో నెల్లూరులో కూచిపూడి, భరత నాట్యం, రికార్డు డ్యాన్సులు తదితరాలలో పోటీలు జరుగుతాయి. అఖిలభారత స్థాయిలో జరుగుతాయి ఈపోటీలు. వివరాలకు కార్యదర్శి నెప్టా అభినాహాలు దగ్గర, నెల్లూరుకు వ్రాయండి.

— —

# శివారెడ్డి పద్యాలు

### రామానాయుడు జయంతి

కలముబట్టినాడ కదలు మల్లోకాలు
బండబారు పగల గుండెకాయ,
వేదికెక్కినాడ వెలవెలవిముత్యాలు
జల్లుగురియు నభకు పల్లవులియు!

పాటితేనిమేటి స్వాతంత్ర్యయోధుల్లో
పద్మగేయు జర్నలిస్టులందు
నాయుడంటిమనిషి నాటకసిగపళ్ళ
యింతవరకు తెలుగు యేరియాలో!

పొట్టలబ్బ నవ్వుబట్టించు హాస్యోక్తి
నర్మగర్భితాల నాట్యమాడు
పీడువాళ్కపైన విలువెల్ల బంగారు
నీ కలమ్ము గానకోకిలమ్ము!

ఆంగ్లపాలనములో ఆ గడ్డురోజుల్లో
పాడుకొల్పు వారపత్రికొకటి
దాదిపోనివాని స్వతంత్రతభావాల
చెమటపూర్చు ఎన్నో శ్రమలకోర్చి!

పల్లెవేయనోడు నెల్లూరుముచ్చట్లు
చదువనోడు మోదసాగరంలో
మునిగితేలనోడు మున్ను ఆ రోజుల్లో
ఆ దినాల్లో ఆంధ్రుడసలె లేడు!

తచ్చుకిడ్చినాడు రాజాధిరాజుల్ని
షరికినాడు గాంధి వుద్యమంలో
వుదరగొట్టినాడు వుద్యోగాలూపాటు
వెల్లనంపినాడు తెల్లదొరల!

అతికుశాగ్రబుద్ధి, అసమాన ప్రజ్ఞాధురంధరుండు రైతు బాంధవుండు
నాయుడంటివ్యక్తి యీ ఆంధ్రరాష్ట్రంలో
పుట్టడింక కాదు మెట్టడింక!

రామానాయుని చరితము
అమూల్యాగ్రమ్ము మధుర మల్పకవినైనే
నేమని చెప్పను? శ్రీమద్రామాయణమంతకాదురా యిదివింతా!

### ఇనమడుగు కనకదుర్గ

అపోతమ్మబోమె, అంకమ్మ కాలగ
కృంలో శీవమాయె, భద్రకాళి
కమ్మనమూర్తులెక్కున్న కనిపెట్టుకోమంది
మాటుమూల్లి చాటుమాటు పావం!

కోరినవన్ని నీకు సారాయిసీసాలు,
త్రాగినవన్ని నీకు కాటికల్లు
పుల్లనప్పై నీకు పొట్టేళ్ళు అరకోళ్ళు
తక్కువేమి నీకు తల్లిదుర్గ!

### జనవాణి

(3వ పేజీ కొనసాగింపు)

టారు. కాని అది కొన్నిసంవత్సరాలలో ప్రమాదకరమని "హ్యూమన్ రైటెన్స్" అనే పత్రికలోవచ్చి పరిశీలనాన్ని కూర్చిన వ్యాసంవల్ల తెలుస్తుంది. పరిశీలనాలలో మూడురకాలున్నాయట: 1) సీటితో కూడినది 2) గ్యాస్‌తోకూడినది 3) చీముతోకూడినది. ఈ మూడవది క్యాన్సర్‌గామారే ప్రమాదమున్నదని ఆ పత్రిక వ్రాసింది. ఇది మాబోటివారికి కొత్తవిషయంగాతోచింది. పరిశీలనమున్న వారు జాగ్రత్తపడవలెననుటకు ఇది ఒక హెచ్చరికగా భావిస్తున్నాను.

నెల్లూరు — డాక్టర్ డి. ఎస్. రెడ్డి ఎం.బి.,బి.ఎస్.

### ఒక టపుణ బస్

అన్ని టపుణ బస్సులలో గొప్పత నుంచి ఏ. ఆర్ కాలేజీకి 70 పైసలు తీసుకుంటే, 32 వ నంబరు బస్సులో మాత్రం 80 పైసలు వసూలు చేస్తున్నారు. అదేవిధంగా స్త్రీలకు ముందు సీట్లు కేటాయించడంలేదు. అధికార్లు ఈ లోపాలను సవరింప చేయాలని కోరుతున్నాను.

నెల్లూరు — పి. రవి

### హర్షం

అవశ్యకతమైన Wine and Women చిత్రం ప్రదర్శనను నిలుపుదల చేయించినందుకు జాయింట్ కలెక్టరు శ్రీ దయాదారిని అభినందిస్తున్నాను.

కావలి — వి. రాజశ్రీ (ఫైనల్ బి ఎస్‌సి.)

### మేము—మీరు

(3వ పేజీ కొనసాగింపు)

లాది రూపాయలు పడ్డీకి తీసుకున్నారు. ఆయన బ్రతికుండగా, బాకీలను ముక్కపిండి వసూలుచేసి ఆ వడ్డీలను దానధర్మాలకు ఖర్చుచేసేవారు. వారిపేరిట బ్యాంకులలో వున్న మొత్తాలు వడ్డీకి మార్చేవారి గుప్తదానంలో పడేవంతు కూడా వుండదంటారు. అయితే వారి మరణానంతరం ట్రస్టుబోర్డుకు దక్కింది బ్యాంకులలో వున్న స్వల్పధనంమాత్రమే. ప్రైవేటు వ్యక్తులచేతులలో వున్న లక్షలాది రూపాయలు గుప్తంగానే వుండిపోయాయి. వారి బాకీదారులు, దీన్ని తలా కొంత పంచేసుకున్నారు: టౌన్‌లో ఈ విషయం అందరికీ తెలుసు

ఈ నేపథ్యంలో ఆర్. ఎల్. రెడ్డి ఆస్తుల దుర్వినియోగం, దురాక్రమణ గురించిన ఆవేదనతో జమీన్ రైతు చేసిన వ్యాఖ్యలకు ఆయన అభిమానులెవరూ బాధపడకూడదు. ఆయన అపారమైన ఆస్తులను వారి ట్రస్టుకు పూర్తిగా కాపాడే బాధ్యత, ట్రస్టు సభ్యులు చేపట్టాలి.

నెల్లూరు · తిరుమూరుసుధాకరరెడ్డి

### కావలి విశ్వోదయ

విశ్వోదయ పవిత్రత గురించి ప్రచురితమైన సినీకవీశర విమర్శ మాటుగా నీటుగా సాగింది. అయితే యీ విమర్శ కేవలం జవహర్‌భారతి కళాశాలకు మాత్రమే పరిమితం అయినట్లు కనపడుతుంది.

ఎక్కువభాగం అయ్యవార్లు కూడ ట్యుటోరియల్స్ నిర్వహణ, ట్యూషన్స్ ఎంట్రెన్స్ పరీక్షలకు తర్ఫీదు ఇవ్వడం లాంటి కాసుల అర్జనకే ఎక్కువ ఆసక్తి చూపుతున్నారనిపిస్తుంది. కళాశాలలో మూడునెలల, ఆరునెలల పరీక్షలు కూడా అసలు నిర్వహించలేదు. అందుచేత విద్యార్థి శ్రేయోభిలాషిగా నేను ఎంతో బాధపడుతున్నాను.

పవతాల్ విషయం అటకాలా విజం. శ్రీమతి బీబీగారిరి బోర్డు కానవసరంలో కాని, మరెక్కడాకాని వెలుగునుచూడక పోవడాన్నిబట్టి కళాశాల విధుల దుర్వినియోగం సుస్థాపితం చేయబడిందేమో ననుకోవలసివస్తున్నది.

శ్రీ టాంబో, శ్రీ రామమూల నాయుడు లాంటి మేథావుల, మానవతావాదుల పాలనలో స్వర్ణయుగంగా వెలుగొందిన విశ్వోదయ, జవహర్‌భారతికు క్షీణయుగం ప్రారంభమైందని వాటోంట్లకు అనిపిస్తుంది, అలాకాకుండ వుండాలనేదే నా కోర్కె.

కావలి — సుధాకర్

# పినాకినీతీరం

(2వ పేజీ తరువాయి)

## స్టేట్ బ్యాంకివారి దీపావళి

స్టేట్‌బ్యాంకి ఉద్యోగుల రాష్ట్ర మహాసభ అట; చిత్ర వర్ణ దీపకాంతులతో సింహపురినే కలియుగ వైకుంఠం చేసి వేశారు; వైకుంఠమనేది ఒకటుంటే, దానిని విష్ణువనేవాడొకడుంటే తన నివాసానికంటే నెల్లూరే అనేకరెట్లు వైభవోపేతంగా వుందని దిగివచ్చి వుండాలి.

అంతేకాదు, మహాసభ మొదటిరోజు కాదు, రాత్రి మొదటిరోజు సాయంత్రం నెల్లూరు దద్దరిల్లిపోయింది; వర్ని మానియాలనో, శ్రీలంకలోనో, కనీసం ఢిల్లీ పరిసర ప్రాంతాలలోనో, అయివుంటే కలకలం వచ్చి దియ్యవలసినంత భయంకరంగా వుంది. ఒక్కసారి శత కోటి శతఘ్నులు పేలినట్లుగా వుందిందా శబ్దం; ఇంతకూ విచారిస్తే అది స్టేట్‌బ్యాంకి ఉద్యోగుల ఆనందపు దీపావళి తెలిపింది; ఎప్పుడో అక్టోబరు నవంబరులలో రావలసింది ఐదారునెలలు ముందుగావచ్చిందనిపించింది.

చర్చి గ్రౌండ్సులో వెలసిన ఆకాశమంత పందిరి, అలంకరణం, రంగు రంగుల కాంతులీనిన ఆ రోడ్డు వైభవం.... అన్నీ ప్రత్యేకతలే. అధికారాన్ని ఎంత దుర్వినియోగం చేసినా, ఏ రాజకీయ పార్టీకూడా ఇంత విస్తృతంగా, ఇంత వైభవంగా ఏర్పాట్లు చేసివుండదేమో అనిపించింది. బ్రహ్మ దలచుకుంటే ఆయుషుకు కొదువా అన్నట్లు బ్యాంకి వారు తలచుకుంటే ధనానికి కొదవా అని పించింది. అంత గొప్పగా ఏర్పాట్లుచేసిన నెల్లూరు బ్రాంచివారిని అభినందిస్తూ, వారి ఆనందంలో మనమూ పాలు పంచుకొందాం!

## టవున్‌హాలు వేదిక-చీలిక పేలిక కర్టన్లు

టవున్‌హాలు వేదిక మీది కర్టన్లు చూస్తే ఏంగతి పట్టిందా అనే ఆవేదన కలుగుతుంది. రంగు పోయింది; మాసిపోయాయి; పైగా చీలికలు పేలికలు అయిపోయి, చూడడానికే అసహ్యంగా వున్నాయి. నెల్లూరు టవున్‌హాలు అంటే గొప్పపేరు; అటువంటి హాలు ఈస్థితిలో వుండడం చూసి బయటనుండి వచ్చే పెద్దలకు ఎటువంటి అభిప్రాయం ఏర్పడుతుందో ఆలోచించండి.

ఆ చిరిగిపోయిన కర్టన్లను కట్టించింది ఈ కమిటీవారు కాదు; పాతవారేననుకొండి; కాని అంత దుస్థితిలో వున్నపుడు కొత్తగా వచ్చినవారు ఏమిచేసినట్లు? విధులు లేవా, గమనించలేదా, శ్రద్ధ కొరవడిందా, ఏమి కారణం? ఇప్పటికైనా మంచి కర్టన్లు వేసి వేదికకు అందాన్ని చేకూర్చగలిగితే బాగుంటుంది.

సభలు సమావేశాలవంటి కార్యక్రమాలు ఏర్పాటు చేసుకునేవారు అక్కడి ఎలక్ట్రిషియన్ చేతనే లైట్లు వేయించుకోవాలట; అక్కడి మైకే విధిగా వుపయోగించుకోవాలట. ఇటువంటి నిబంధనలు కొన్ని విచిత్రంగా అమలు జరుపుతున్నారు. ఈ రూల్సు ఎవరివో నాకు తెలియదు. కాని అవుసరం లేకుండా ఏర్పాటు చేసుకునే అవకాశమున్నవారికి కూడా ఇటువంటి నిర్బంధాలు అనువర్తించడం న్యాయమా? ఇందులో ఏదైనా కమీషన్ వ్యవహారమున్నదనే అపోహకు అవకాశం కల్గటంలేదా? స్విచ్ బోర్డులు గిర్డులు పాడుచేస్తారనుకుంటే అటువంటి వారినుండి ఎంత అవసరమైనా డిపాజిట్ రూపంలో ముందే పట్టుకొని వసూలుచేసుకోవచ్చుకాని, ఇటువంటి రూల్సు సమంజసం కాదు.

ఇటువంటి రూల్సు ప్రవేశపెట్టడంలో శ్రద్ధచూపుతున్న కొత్త కమిటీ, ఎడారిగా బీడువారివున్న టవున్‌హాలు ముందు ప్రదేశాన్ని చెట్లుచేమలతో సౌందర్యవంతం చేయడానికి ఎందుకు ప్రయత్నించకూడదు?

NSR

కోరుకొండ సైనిక స్కూలు శిక్షణ



## సందేశాలు

(4వ పేజీ తరువాయి)

### బి. ఎస్. ఆర్. కృష్ణ

పూజ్యులు స్వర్గీయ వెంకట రామానాయుడుగారి వ్యక్తిత్వం స్మృతి ఏటేటా మనమంతా జ్ఞాపకంచేసుకొనే సంవత్సరోత్సవ కార్యక్రమాన్ని తలపెట్టినవారి పర్వప్రయత్నంగా సాగిస్తున్న మీకు నా హార్దికాభినందనలు. ఒకసారి విద్యార్థి విశ్వంగారితోటి కలిసి వచ్చి పాల్గొన్ననాటి జ్ఞాపకాలను తరచు నెమరువేసుకుంటూ వుంటాను.

ఈ సంవత్సరం నాకు చాలసన్నిహిత మిత్రులు, జర్నలిజంలో 'కాకలు తీరిన జంటు' అనదగిన సీతారామ్ గారికి ఈ సన్మానం జరగటం నాకు వ్యక్తిగతంగా కూడా చాలా ఆనందంగావుంది. వక్తయి చెబుతారో లేదో నాకుతెలియదుకాని, సీతారామ్ మద్రాసు ప్రెస్‌క్లబ్ పితామహుడు; నేనూ అందులో ఇప్పటికీ సభ్యుడను. సీతారామ్ గారికి నా అభినందనలు అందించండి.

### డాక్టర్ ఎం. అప్పిరెడ్డి

యాభైఏళ్ళకు పైబడి విరామరహితంగా ప్రకటింపబడుతున్న వారపత్రిక 'జమీన్ రైతు' ఒక్కటిగానే కనబడుతుంది. వివిధ రంగాలలోని పాఠకులకు అవసరమైన వివిధ్య విషయాలు 'జమీన్ రైతు'లో వుంటాయి. రామానాయుడు గారి జయంతి జయాసహంకారాలి.

### సత్య సుబ్రహ్మణ్యం

కోస్తావాణి (రాజమండ్రి) దినపత్రిక సంపాదకులు శ్రీ కూచిమంచి సత్య సుబ్రహ్మణ్యం—

ఈ సంవత్సరం నెల్లూరు వెంకట రామానాయుడుగారి అవార్డును మిత్రుడు నాలుగు దశాబ్దాలుగా పత్రికా వ్యాసంగంలో వున్న శ్రీ జి. సీతారాంకు ఇస్తున్నారని తెలిసి ఎంతో ఆనందమైంది. పత్రికా విలేఖరిగా ధైర్య సాహసాలతో సుదీర్ఘంగా జర్నలిజానికి సేవచేసిన శ్రీ సీతారాం ఈ సన్మానానికి ఎంతైనా అర్హుడు. నా హృదయపూర్వక అభినందనలను ఆయనకు అందజేయండి.

### ఇతర పెద్దలు

రామానాయుడు జయంతి విజయాన్ని ఆకాంక్షిస్తూ పెక్కుమంది పెద్దలు సందేశాలు పంపారు. 'ఆంధ్రజ్యోతి' సంపాదకులు శ్రీ పండూరి రామమోహనరావు, రాష్ట్ర వర్కింగ్ జర్నలిస్టుల అసోసియేషన్ అధ్యక్షుడు శ్రీ ఉపేంద్రబాబు; 'ఆంధ్రజ్యోతి' హైదరాబాదు చీఫ్ రిపోర్టర్ శ్రీ జి. వెంకటరావు, 'హిందూ' ఢిల్లీ లీగల్ విలేఖరి శ్రీ పద్మనాభరావు, సమాచారశాఖ డైరెక్టరు శ్రీ సి. వి. నరసింహారెడ్డి, ఒంగోలు డిప్యూటీ డైరెక్టరు శ్రీ ఎం. చంద్రశేఖరయ్య, శ్రీ ఎం. సుబ్రహ్మణ్యం (ఆంధ్రప్రభ).

——

## పెండ్లిండ్లు

(4 పేజీ తరువాయి)

పేట శ్రీ ఇమ్మనేని ఈశ్వరరావు కుమారుడు, ఎం. బి. బి. ఎస్. డాక్టరు తులసి ప్రసాదరావు వివాహం 20 తేది తిరుపతిలోని హోటల్ బాలాజీభవన్‌లో జరిగింది.

ముందు పెండ్లిలో అంత దూరాన పెండ్లిపెట్టి చుట్టాలను స్నేహితులను చంపాడండి రాజగోపాలయ్య!

### కమ్మపాళెం పెళ్ళి

కమ్మపాళెం రైతు ఉన్నం వెంగయ్య చౌదరి కుమార్తె, నెల్లూరు టింబర్ వ్యాపార యువకుడు రామారావు సోదరి ప్రసూనకు; చిత్తూరు పోలీస్ సబిన్స్పెక్టర్ శ్రీ ముత్తులూరి వెంకటస్వామినాయుడు కుమారుడు శివప్రసాద్ బి. కాం. కు 24 తేదీ కస్తూరిదేవి విద్యాలయంలో పరిణయం జరిగింది.

### వరిగొండ వివాహం

వరిగొండ, చింతంరెడ్డి సుబ్బారెడ్డి కుమార్తె విద్యుల్లత కరవదిల్లాకు చెందిన శ్రీ కె. రామచంద్రారెడ్డి కుమారుడు కమేష్ కుమార్ వివాహం మే 1 తేది టౌన్‌హాలులో జరిగింది.

## చిత్రసమీక్ష

(8 పేజీ తరువాయి)

పాండుచేత హత్యలుచేయించడం దర్శకుడికి వెరైటీ అనిపించినట్లుంది.

మూడూ ముక్కాలు భాగం సినిమాలో పెద్దసస్పెన్స్ అనుకొన్నదికాస్తా 'కుంటెల్ల హత్య'గా దిగజారి పతనంతో కొండంత రాగంతీసి కుమ్మదియ్యలో అన్నట్టు తయారైంది.

మురళీ హేమల ప్రేమసన్నివేశాల్లో ప్రేమలేఖలు కుప్పతిప్పలుగా పడటం, జె. వెత్తుకొని వెళ్ళేటప్పుడు పులిరాజు అతిహాస్యం అపహాస్యంగా మారిపోవడం రావుగారి మతిమరుపు మాటలు మితిమీరడంవంటివి నవ్వులను మింగేశాయి.

అయితే ఎం. వి. రఘు ఫోటోగ్రఫీ అద్భుతంగా వుంది. వసంత కోకిలారావాలు కుహూకుహూ నాదాలు ప్రేక్షకులకు గిలిగింతలు పెట్టాయి. ఇళయరాజా సంగీతం వీనుల విందు కాగా, వేటూరి పాటలువింటుంటే మత్తుమూర్ఛలుతిరుగుతున్న అనుభూతి. హీరోగా కొత్త నటుడు మురళి, మతిమరపు రావుగా సత్యనారాయణ, పనిమనిషి పాత్రధారిగా రాళ్ళపల్లి, ఫారెస్ట్ రేంజర్‌గా శరత్‌బాబు; సుమతిగా సూరపనేని పూర్ణిమ; హేమగా భానుప్రియ నటించారు. వై. విజయ నటనలో జీవించింది.

——

## జన్మదిన ప్రశంస

(8వ పేజీ తరువాయి)

సినిమారంగంలోమాత్రం కృష్ణ చేపట్టిన పని ఏదీ నిష్ఫలం కాలేదు. అయితే, ఆయన చేపట్టిన ప్రతికార్యం వివాదాస్పదం కావడం మామూలైపోయింది. అల్లూరి సీతారామరాజు చిత్రంతీసినా, పద్మాలయ స్టూడియో కట్టినా సంచలనం తప్పలేదు.

కృష్ణవంటి ఉత్సాహికి 48 ఏళ్ళు ఒక వయస్సేకాదు. ఇప్పటికీ నిత్యయవ్వనోత్సాహంతో తొణికిసలాడుతుంది ఆయనలో. పరిశ్రమలో ఆయనది ప్రత్యేకస్థానం; దాన్ని సాధించడం అన్యులకు అసాధ్యం.

——

# ప్రాతలో రామానాయుడు నిర్భయపు పోకడ

జమీన్‌రైతు రామానాయుడు జయంతి జూన్ 3 వ తేది టౌనుహాల్లో ముక్తసరిగా ముచ్చటగా జరిగింది. ఈ ఏడాది జయంతిలో ప్రత్యేకత - రామానాయుడు అవార్డును ఒక విలేఖరికి ఇవ్వడం. గత పదకొండేళ్ళుగా నిర్విఘ్నంగా సాగుతున్న జయంతి సభల్లో, ఇప్పటి వరకు సంపాదకులు మాత్రమే సన్మానింపబడ్డారు. అయితే పత్రికకు ప్రాణం, జీవం విలేఖరి. వారు సంపాదించే వార్తల

## జయంతి సభలో ప్రశంసలు

కథనంకోసే పత్రికకు పేరు, ఖ్యాతి వస్తుంటాయి. కాని ప్రజల దృష్టిలో కనపడేదీ మాత్రం సంపాదకులే విలేఖరులు కాదు. పత్రిక అభివృద్ధికి కృతజ్ఞతగా సేవచేసే 'విలేఖరులను గౌరవించాలనే దృష్టితో ఈ ఏడాది సన్మానానికి యు.ఎన్.ఐ. హైదరాబాద్ చీఫ్ అయిన శ్రీ డి. సీతారాం ఎంపికయ్యారు. పాత్రి



''జమీన్‌రైతు ప్రింటింగులో ఆధునిక పద్ధతులు అవలంబించాలి''

**వి. జి. ప్రసాదరావు**

కేయవృత్తిలో పలుదశాబ్దాల సుదీర్ఘ అనుభవశాలి ఆయన. ఈ ఏడాది జయంతి ప్రత్యేకత అదే.

3 వ తేది జయంతి సభకు బీహార్ గవర్నర్ శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య అధ్యక్షత వహించారు. సమకాలీన పరిస్థితులలో పత్రికల స్థానం, బాధ్యతలగురించి సాధికారికంగా, విషయపూర్ణంగా ప్రసంగించారాయన.

జమీన్‌రైతుతో నాకు పలుదశాబ్దాల చిరపరిచయం. మద్రాసు శాసనసభలో బద్దెపూడి వెంకటనారాయణరెడ్డి, కమతం షణ్ముగం వంటి సహచరులద్వారా పత్రికతో నాకు పరిచయం ఏర్పడింది. జమీన్‌దారీ విధానంలోని రైతుల బాధలు, సమస్యలు జమీన్‌రైతు ద్వారానే చదివి తెలుసుకుంటుండేవాడ్ని. రామానాయుడి గారితో నాకు వ్యక్తిగత సంబంధం లేకున్నా, ఆ రోజుల్లో ఆయన పాటలు, పద్యాలు ఆసక్తిగా చదువుతుండేవాడ్ని' అన్నారాయన.

రామానాయుడుగారు అకుంఠిత కృషితో, సుదృఢ సంకల్పంతో పత్రిక నడిపి వార్తావిశ్వసనీయంగా వాస్తవాలను యధాతథంగా ప్రకటించేవారని అంటూ: ఆ లోకదర్శి జమీన్‌రైతు ఇప్పటికీ అనుసరించడంపట్ల ఆనందం వ్యక్తం చేశారు.

దేశం ప్రస్తుతం క్లిష్టపరిస్థితులలో వుంది. స్వాతంత్ర్యంవచ్చి 37 సంవత్సరాలు గడిచినతర్వాత ఇప్పుడు భారత దేశం ఏకంగా నిలబడగలదా, లౌకిక ప్రజాస్వామ్యాన్ని కాపాడుకోగలదా అన్న ప్రశ్నలు ఉత్పన్నం అవుతున్నాయి. ఈ సందర్భంలో దేశసమైక్యత సంక్షేమం కాపాడవలసినబాధ్యత పత్రికలమీద మీకవుంది అన్నారు శ్రీ పెండేకంటి.

పత్రికా స్వేచ్ఛ రాజ్యాంగప్రసాదిత మని, దీనిని హరించడానికి కొన్నిరాష్ట్ర ప్రభుత్వాలు యత్నించడం శోచనీయ మని, ఇటువంటి చర్యలపట్ల పత్రికలు అప్రమత్తంగా వ్యవహరించాలని పిలుపు నిచ్చారు.

అయితే పాత్రికేయులుకూడా కొన్ని నైతికవిలువలు పాటించవలసివుంది. సంఘటనలను వక్రముగా చిత్రించరాదు. ఆ బాధ్యత వారిపైవుంది. సంచలనాత్మకవార్తలు పంపేటప్పుడు మరీ నిగ్రహంగా వ్యవహరించాలి. రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిస్థితులను, సంఘటనలను వస్తునిష్ఠతో (Objectivity) సక్రమమైన దృక్పథంతో ప్రజల ముందుపెట్టగలిగిన విలేఖరి, సమాజానికి ఎంతో సేవ చేసినవారౌతారని వెంకటసుబ్బయ్యగారు అన్నారు.

సీతారాం వంటి నిర్భయుడైన, నిజాయితీగల్గిన విలేఖరికి రామానాయుడు అవార్డు ఇవ్వడం ముదావహమన్నారు.

హైదరాబాదు యు.ఎన్.ఐ. ప్రధాన ప్రతినిధి శ్రీ డి. సీతారాం జాతీయ దిన పత్రికలు గ్రామాలపట్ల ప్రదర్శిస్తున్న నిర్లక్ష్యవైఖరిని విమర్శించారు.

''ఇటీవలికాలంలో పత్రికారంగం కూడా ఒకపరిశ్రమైపోయింది, దరిమిలా యాజమాన్య నిర్మాణతకు ప్రాధాన్యత

—కొరవ 8వ పేజీలో



రామానాయుడుగారి జయంతి సభలో బీహారు గవర్నరు పెండేకంటి వెంకటసుబ్బయ్య (ఎడమనుండి రెండవవారు) గారి నుండి సన్మానపత్రం, అవార్డు అందుకొంటున్న డి. సీతారాం (ఎడమనుండి మొదటివారు)



Edited, Printed & Published by N. Sree Ramamurthy at The Zamin Ryot Press, Thipparajuvari Street, Nellore (A. P.)